# ఏకోజీ రామాయణము

## ద్విపద

పరిష్కర్త సంపాదకులు

**డా॥ మొరంగపల్లి బాగయ్య**

తెలుగుశాఖ ఉపన్యాసకులు

ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు

ఎం. శ్రీనాథ్ కుమార్ పబ్లిషర్స్

హైదరాబాదు - 5000 44

ఏకోజి రామాయణము - ద్విపద
EKOJI RAMAYANAMU - DWIPADA
Editor Dr. M. BAGAIAH

ప్రథమ ముద్రణ - ఏప్రిల్ - 1౯౯౮
ప్రతులు : 1000
ప్రథమ సంపుటము

వెల : రూ. 55/

ప్రతులకు :
ఎం. శ్రీరామచంద్ర కుమార్
రమా నిలయము
ఇం నెం. 12-11-833/41/1
అంబర్‌నగర్, అడిక్‌మెట్టు
హైదరాబాదు - 5000 44

ముద్రణ :
శ్రీ కళాశ్రీ ఆర్ట్ ప్రింటర్స్
బసంత్ టాకీస్ ప్రక్కన
లింగంపల్లి - హైదరాబాదు - 5000 27
ఫోన్ : 246645

---

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయము పొందినది

# విషయ సూచిక

## ద్వితీయ సంపుటము

# ఉపోద్ఘాతము

ఆంధ్ర సాహిత్య సంస్కృతికి కంఠాహారమనదగినట్లు తంజావూరు సంస్థానము వెలసినది ఇచట స్వర్ణాభిషేకము గావించిన రఘునాథ భూపాలు డెన్నదగినవాడు. ఈ సంస్థానమే "గీర్వాణవాణి మధురవాణి"గా మార్చిన "శుకవాణి"కి కనకాభిషేకము జరిగినది. "ఆంధ్రపాణిని" బిరుదాంకితుడగు శేషాచలపతి సంగీత సాహిత్య విద్యావిశారదుడగు "శహాజీ" కనకాభిషేక గౌరవమునందినాడు. ఇట్టి శహాజీ వంశమువాడే ప్రస్తుత గ్రంథకర్త ఏకోజీ. ఇతడు భోసలవంశ సుధాంశుడును, తుళజేంద్రుడు, తులజాజీ (తుక్కోజీ) క్రీ శ 1728-36 వరకు ఈ 8 సం॥లు తంజానగరిని ఏలిన మహారాజు. ఇతని తండ్రి మొదటి ఏకోజీ (క్రీ శ. 1676-83) కుమారుడు రెండవ ఏకోజీ క్రీ శ 1737-39 రెండు సం॥లు రాజ్యమేలినవాడు బోంస్లే (భోసల) వంశము వారందరు మహారాష్ట్రులయ్యు తంజావూరు పీఠమునెక్కి తెలుగు సరస్వతిని ఆరాధనము గావించినవారు. ఈ ఏకోజి కృతి రామాయణములో ఆశ్వాసాంత ద్విపదలో తను యేకోజిననియు, తన తండ్రి తుళజేంద్రు డనియు ఆ తండ్రి తుళజేంద్రునకే మకరంద బిరుదాంకుడనియు స్వయముగా పేర్కొన్నాడు ఇతనికి సరస సాహిత్య లక్షణ చక్రవర్తియనియు పేరున్నది. ఈ రామాయణ కర్తయగు ఏకోజికి బాబాసాహెబ్ అని నామాంతరము కూడ కలదు.

## ద్విపద రామాయణములు

1. రంగనాథ రామాయణము :— గోన బుద్ధారెడ్డి కృతి ద్విపద రామాయణమిది క్రీ శ. 1240 అనియు ఒక పక్షమువారును, క్రీ. శ. 1290 అనియు రెండవ పక్షము వారును పేర్కొనిరి. ఇదే మొదటి ద్విపద రామాయణముగా గ్రహింప వచ్చును.

గణములు ఒక సూర్యగణము యుండి మూడవ గణాద్యక్షరము యతి స్థానమై నది. ప్రాస నియమము కలదు. ఈ రెండు పాదములకు ప్రాసాక్షరమేకము గాయును. కాని మంజరీ ద్విపదయందీ నియమము కూడ లేదని తెలియు చున్నది. ఉదా:- కావ్యాలంకార సంగ్రహ చూడామణియందు యిట్లున్నది.

"శక్రత్రయంబును సవిత్రుండుఁబాద
విక్రీడితులు మృదు ద్విపదికి నెపుడు
వళియుఁబ్రాసంబును వలయు దీనికిని
వలదు ప్రాసంబంద్రు వరుస మంజరిని"

ఇట్టి ద్విపదకు మూలస్థానమనబడిన కన్నడ కవులే ఆద్యులు. ద్విపదను వీరు "సులిదబాళెయహాడు" శర్కరకేళి శైలిగా పేర్కొనిరి. ఇది భక్తి ప్రధానమై వీరశైవ వాఙ్మయమున కాద్యమైనది. ఇందులో కవి ద్విపదను ద్విపదియని వాడుట గమనింపదగినది. లాక్షణికుడైన యనంతుడు ద్విపద యందలి యతిని గూర్చి చెప్పిన విధము.

"శ్రీమందిరాకారు జితదైత్య ధీరుఁ
గీర్తించుచోఁబుణ్య వర్తనుండనుచు
యతిమాఱు ప్రాసమిట్లచ్చోట నిడక"

యని ద్విపదయందు ప్రాసయతిని నిషేధించెను. కాని యితనికి పూర్వుడైన పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రయందు,

జాతులు మాత్రాను సంధాన గణవి
సితులుగాను 'యనియత గణై'ర
నిచును 'ఁబ్రాసోవా' యునియు' యతిర్వా'య
నియుఁ జెప్పు ఛందో వినిహితోక్తిగాన
ప్రాసయైనను యతియై వడియైన

దేసీగా నలిపియాది ప్రాస నియతి
దప్పకుండగ ద్విపదలు రచియింతు"

అని పేర్కొన్నాడు. ఇంతేగాక "ఇదియునుగా నైహికాముష్మిక ద్విపద హేతువగుట ద్విపద నాఁబరగు"నని చెప్పటచే ద్విపద నిహపరసుఖహేతువైనదని నిండుగా నమ్మినాడు. ఇక పరి జనాశ్రయమునందు.

"ఇంద్రగణములు మూఁడిన గణం బొకటి
చంద్రాస్య ద్విపదకుఁ జనుఁ జెప్పరేచ"

యని పేర్కొనెను. తాళ్ళపాక తిరువేంగళనాథకృతమగు అష్టమహిషీ కల్యాణములోని ద్విపద లక్షణమును గూర్చి

"వాసవులు మువ్వురు వనజాప్తుఁడొకడు
భాసిల్లునది యొక్క పదము శ్రీకాంత
క్రమమున నీ నాల్గు గణములు నడచుఁ
గ్రమ దూరముగ ప్రయోగము సేయరాదు
ఆపాదమునకు మూఁడవగణంబాది
దీపించు యతి యంబుధి ప్రియతనయ
యుపమింపనవి ప్రాసయుతములై రెండు
ద్విపదనా విలసిల్లు వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁ దెగఁజెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితర భాషలను
యతుల లోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులు చెల్లును బ్రయోగాను సారమున
ద్విపదతో ద్విపద సంధిలనేత కొద్ది
ప్పుడు రెంటను గూర్పనదియు యుక్తంబు
మరియు సంస్కృతపు సమాస రూపమున
నెరయ నెన్నిటినైన నిర్మింపఁదగును
తెనుఁగున గూర్చిన ద్విపద యంత్యమునఁ

నొనర(గ్రియాంత సముచ్చయాంతములం
దనరు నకారముత్వము గూడెనేని
విసుతింప నుత్తర ద్విపదాదియందు
గొనకొన్న స్వరముతోఁ గూడఁగాదనుచు
నొనరింప సుకవీంద్రు లుద్దండమంద్రు
అరసున్న నొనగూర్చ ననువైన హల్లు
గరిమ నీ ద్విపదాదిఁ గనుపట్టెనేని
తొలి విభక్తికిఁ దక్కఁదుది విభక్త్యంత
ములు నకారములును ముకుర బింబాస్య
యానకారము చెల్లు నరసున్నలగుచు
నానీల రచద్భృంగ యలమేలు మంగ
యను లక్షణంబుల ననువొంద సుకవి
జన సుప్రయోగైక శరణమై నిఖిల
జగదేకనుత విరాట్ఛందోవ తీర్ణ
యగుచునే ద్విపద విఖ్యాతి చెలంగ"

అని అష్టమహిషీ కల్యాణమునందు (ఆ–1–131 నుండి 150 వరకు) ద్విపదను గూర్చి పేర్కొన్నాడు. ప్రాస, యతి విషయములలోనేగాక యుత్వ విశిష్ట, పాదాదియందును, పాదాంతమందును, సంధి కార్యములందును సయితము నియమములు పాటించి లక్షణమును జెప్పినాడు.

బచ్చు సిద్ధకవి యనునతడు తన బసవ పురాణమునందు,

"ఇల పాలకురికి సోమేశుండు మున్ను
తొలగక ప్రాసముల్ ద్విపదలను
లలి రచించుట యది లక్షణంబుగను
నెలమి రేఫ ఱకారములు శివకావ్య
ముల యందుఁజెల్లుఁ దప్పులుగావు గాన
ఆ పాల్కురికి సోముననుమతి నేను
ఏపిత ప్రాసయతిచ్ఛంద సరణి

నామహా గురుదేవుననుమతి యబ్లె
శ్రీ మెఱయంగ రచించితినిట్లు
అని పేర్కొన్నాడు.

## యక్షగానము

ఆంధ్ర వాఙ్మయములో తొలుత యక్షాదుల యాటపాటల ప్రసక్తిని పాల్కురికి సోమన (క్రీ. శ. 1280-1340) పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణమునందు గలదు. ఇది శ్రీశైలయాత్ర శివరాత్రి జాగరణ సందర్భము నందు నానాదేశయాత్రికులు అచటికి చేరినవారికి వినోదము కాలక్షేపము గల్గించుకై చెప్పిన సందర్భమున గలదు.

"ఆదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు (రి)
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడసట్లాడు" అని గలదు.

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణమున (ఆ-3-ప-65) నందు దక్షా రామ ప్రశంస సందర్భమున

"కీర్తింతురెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి"

అని యక్షగాన ప్రసక్తికిదే మార్గమైనది. దీనికి మూలమనదగినది సంస్కృత భీమేశ్వర పురాణము. (అధ్యా 10 . శ్లో. 19) నందు

"కీర్తయంతి స్మమాహాత్మ్యం గంధార్వాశ్చ దివాకనః
గాంధర్వ విద్యా నిపుణా గాంధర్వేణ గరీయసా"

యని పేర్కొనెను. ఇదియే శ్రీనాథుని కాలమున కొక ప్రత్యేక ప్రచారమేర్పడినట్లు కన్పడుచున్నది. వీరు గానకళా ప్రావీణ్యత గల్గిన గంధర్వులు.

వారిపేరనే గాంధర్వ వేదము వెలసినది. ఈ గంధర్వులు "యక్షగాన సరణి" బాడిరనగానది శ్రీనాథుని కాలమున ప్రత్యేక గానశైలిగా పరిగణింపబడుచున్నట్లు కన్పించును. క్రీడాభిరామములోను, పనుచరిత్ర యందు ప్రవరుడు హిమవత్పర్వత ప్రాంతమున "గంధర్వ యక్షగాన పూరితమగు నొక్క కోనఁగనియె" అనియున్నది. పారిజాతాపహరణమున "యక్షగ్రామ వాస్తవ్యులు" అనియు, "యక్షులు మేళము గూడి పాడుచుందురు దిక్పాల సభల"యని యున్నది. రామాభ్యుదయమున..... గరుడ గంధర్వ కిన్నెర కింపురుష యక్షగానంబులను గానంబుసై నెరయు అని యున్నది. ఈరీతి కర్ణాటాంధ్రములలో యెక్కువగా కాన్పించును. సింహళ, నేపాళము లందును గలదు.

యక్ష జక్క శబ్దమేయని భాషా శాస్త్ర ప్రమాణము ఈ జక్కులవారే యక్షులుగా వెలసిరనియు తెలియుచున్నది. వీరు ప్రాచీన కాలములో దేవాలయ ముల్లో భక్తులకు, యాత్రికులకు రాత్రి వినోదము కాలక్షేపము కల్పించుటకై భగవంతుని పేరిట నృత్య, గాన, కళా విశేషములు నాలపించువారేమో? ఇట్టి వారి విద్యయే జక్కుల, యక్షుల విద్యగా వెలసినది. ఈ విద్య దేవుని ఊరే గింపులలో రథముల ముందు నాట్యము చేయుచు విచిత్రవేషధారణలు గల్గి ఆడెడివారనియు తెలిసినది. వీరి స్త్రీలు భగవంతుని పేరనే బ్రహ్మచారిణిలుగా ఉండిరట. దేవదాసీ జనులుగా మారినట్లు తోచుచున్నది. వీరు ఆంధ్రదేశమున తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురము ప్రాంతములో నున్నట్లు తెలిసినది

తెలంగాణలో కరీంనగరు జిల్లాయందు స్థిరనివాసులై యున్నట్లు కీ. శే. శ్రీ జక్కుల నర్సింహ ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉద్యాన వనమాలి ఉద్యోగిగా పనిచేసినవాడు తెలిపిన వివరము.

వీరు గొప్ప కళాకారులు, గానకళ, సంగీత, నృత్య విద్యలలో ఆరితేరిన వారైనట్లును, ఇంకా వీరినిగూర్చి E. Thurston వ్రాసిన Castes and Tribes of south India అను గ్రంథములో గలదు. "Jakkula - described as an inferioc caste of prostitutes, mostly of the Balija caste, and as wizards and a dancing and thea-

trical caste. At Tenali in the Krishna dist. It wa customany for each family to give up one girl fo prostitution etc etc. అని వ్రాసినారు. ఈ పద్ధతి వృత్తివారు సికిందరాబాగు నేరెడుమెట్టు ప్రాంతమున యున్నట్లు తెలిసినది.

జక్కుల వారి పేరున నేటికి రాయలసీమలో కర్నూలు జిల్లాయందు సుక్కసానికుంట్ల, జక్కుల చెరువు (గుత్తి), పెనుగొండ, జక్కసముద్రము (హిందూపురం) లలో జక్కులు అధికముగా యున్నట్లు గలదు. వీరికి నాటి గ్రామపనివారికిచ్చినట్లుగానే సంస్థానాధిపతులో, రాజులో ఇనాములుగా (భూములను) యిచ్చిరి.

తేది 9.7.1181 నాడు జక్కుల కన్నాయి యనునామె తిరుమల దేవస్థానమున వేయించిన శాసనమువల్లను వీరి ప్రభావము విదితమగును.

క్రీ శ. 1500 ప్రాంతమున ప్రోలుగంటి చెన్నశౌరి యను నాతడు సౌభరి చరితమను "జక్కుల కథ"ను చెప్పినట్లును, వీరి విద్య ప్రభావితమనియు తెలియుచున్నది.

చిత్ర భారతమున చరిగొండ ధర్మన "యక్షకామినుల నాట్యము" "యక్షవనితలపాట"లను ప్రత్యేకముగా పేర్కొన్నాడు. 17 వ శతాబ్దము నాటి పురుషోత్తమ దీక్షితుని తంజావురాన్నదాన మహానాటకమున జక్కుల రంగసాని యనునామె సత్రములో పదకేళిక పట్టినట్లుగలదు. ఇంతేగాక యక్షరాత్రి, జక్కిణి, బౌద్ధ యక్షులు యనియు కన్పడుచున్నది.

కన్నడ వాఙ్మయమున క్రీ. శ. 12 శతాబ్దమున గల "అగ్గళని చంద్రప్రభా పురాణము" అభినవ పంపిని "మల్లినాథ పురాణము" లందలి "ఎక్కలగాణ"యనునది యక్షగాన పరిణతిగా గ్రహింపవచ్చును. ఇందలి నాయకుడు వన విహారము చేయుచున్న సందర్భమున మేళతాళములు లేకుండగనే దేశీయ గీతాన్వాక దానిని ఒక "ఎక్కల గాణ"మును యింపుగా వినినట్లు వర్ణింపబడినది. మల్లినాథ పురాణములో "కమలామోదియైన తుమ్మెద ఝుంకారము కమలాలయయైన లక్ష్మిని కీర్తించుచు పాడెడి" ఎక్కల గాణ"గా పోల్చ

బడినది. ఇదియే యక్షగానము. ఈ యక్షిణి వేషమును కన్నడ సంప్రదాయ నాటకములలో శ్రీవేషమని, మోహినీ వేషమని పిలుతురు. వీరికొక పాట కావలయును గదా! అదే యక్షగానము 'ఎక్కల గానము' ఇది నృత్యకళా సాహచర్యమును కల్గియున్నదన్న మాట.

క్రీడాభిరామములోని జక్కుల పురంధ్రి యక్షకన్యల యాటయును, పండితారాధ్య చరిత్ర పర్వంణలోని యక్షనేపధ్య సూచనయు యొకటే. ఇదే యక్షగానము యొక్క ప్రాథమిక స్వరూపమనవచ్చును వీరు గానకళా ప్రసిద్ధులు. ఇవే రానురాను వీధినాటకములుగా వెలసినవి. కన్నడిగుల "బయలాట" తమిళుల "తెరుకూత్తు" అనుదానికి సమానార్థకము వీరు పగటివేషములు కూడ ధరియించి విహాటన గావింతురు. ఈ జాతివారిని హైదరాబాదు నందలి పార్శీగుట్ట ప్రాంతమున గత 10 సం॥ల క్రిందట వీధులలో నాడుచుండగ జూచితిని. వీరిప్పుడు బండ్లపై కూరగాయలు అమ్ముకొని బ్రతుకుచున్నారు (ఇచట నాటక శబ్దమే రూపక శబ్దమైనది) వీరు బహురూపములు ధరించి, బహురూపకములు నాడుదురు. ఈ మాటకే కాబోలు బైరూపులవారు అంటారు. ఇది బహురూపకములకు సమానమే. తోలుబొమ్మలాటలు, వెద్దంగములు, వీటితో జవనికలు, పాత్రల చిత్ర విచిత్ర ప్రదర్శన, ప్రరోచక, అభినయభంగులు, సంగీతపు హంగులు మొ॥నవి నాటకములోని తంతులు.

యక్షగాన నాటక రూపములు కొన్ని ఏకోజీ కవి విఘ్నేశ్వర పరిణయము, శాహాజీ 20 నాటకములు దక్షాధ్వర ధ్వంసము, అర్ధనారీశ్వరము, అల్లీఅర్జున నాటకము, కామదహనము, త్రిపుర విజయము, క్షీరసాగర మథనము, భక్త సిరియాళ చరిత్ర, అంధకగంధ గజాసుర వధ మొ॥గునవి.

క్రీ. శ. 1000 ప్రాంతమున వెలసిన యక్షగానము ప్రసిద్ధిమై 17, 18 శతాబ్దములలో బహు రూపములుగా విస్తృతి గాంచినది. శ్రీనాథుని భీమేశ్వర పురాణములో "కీర్తింతు . సరణి" అనునది.

క్రీ. శ. 1400 ప్రాంతములో యక్షగానము పూర్తిగా సుప్రసిద్ధమై, క్రీ. శ. 16 శతాబ్దములోని తొలుతటి కవియగు చిత్రకవి పెద్దన

వృషభగతి త్రిపుట రేకంఘ్రియుగమగు
దుదనేడు లఘువులు తొలగజేయ
జంపెరేకునకు లక్షణము ద్విరదగతి
యగు గాన నొకలఘువందు మాన
రచ్చరేకగును దురగవల్గనము గతి
మరియేకతాళియౌ మధుర గతిని
ఆట తాళమున మాత్రలంఘ్రికిర్వది నాల్గు
నాల్గిట విరతి పద్మాలుగింట
నిలుచు నర్థంపు నర్ధచంద్రికలు పీన
యక్షగాణ కృతులలో నాద్యులిడిన
రగడ భేదంబు లివియౌను రమ్యచర్య
యవిదనిజదాస సముదాయ యాంజనేయ (ల.సా.సం. 2 అ)

క్రీ. శ. 1537 నాటి ప్రఖ్యాత కవి చిన తిరుమలాచార్యుడు "సంకీర్తన లక్షణ"మను సంస్కృత గ్రంథమునందు దరువులు జక్కులరేకులు, ఏలలు, చందమామ పదములు మొదలగునవి నిర్వచించెను. అంతేగాక యక్షగాన పదమును గూర్చి చెప్పిన విధము.

"యక్షగాన పదంబులు నవ్విధమున
సముచితానేక విధతాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబులనుచు
నలరునని హరికీర్తనా చార్యుడనియె" —సం.ల. 66. ప.

50 వ పద్యములో జక్కుల రేకుల పదమును గ్రహించెను. క్రీ. శ. 1500 నాటి వెల్లంకి తాతంభట్టు తన కవి చింతామణియందు "లక్ష్మీ కల్యాణములోని రేకు" అనుపేర "సిరజోదరు రాణి నీలవేణికిని" అని ఉదాహరించి, రేకులను విశేష యక్షగాన పదములకు జక్కుల పేరున్నట్లును ఉదాహరించెను.

నాటినుండి నేటికి లభించిన ఆధార గ్రంథములలో కందుకూరి రుద్ర కవి సుగ్రీవ విజయమే ప్రాచీనతరముగా తోచుచున్నది. కంకంటి పాపరా

జంతటివాడు వేషాల విశేషాలు యక్షగాన రీతిగా నుడివెను. క్రీ శ. 1650 వాడగు కాకునూరి అప్పకవి స్వయముగా యక్షగాన రచనచేసి చూపినాడు. 17 వ శతాబ్ది ఉత్తరార్థములోనివాడగు కులపతి శ్రీ సిద్ధేంద్రయోగి అపూర్వ సృష్టియగు కలాప ప్రదర్శనయందు యక్షగానము గానవచ్చును. శాహజీ ఆస్థానకవి యనదగిన దర్భాగిరి రాజకవి ఆరు యక్షగాన రచనలు చేసెను. అందులో ఒకటి రాజమోహన కురవంజి కురవంజి తమిళ శబ్దము. అనగా కొరవజాతి స్త్రీయని యర్థము. అనగా ఎరుకత. దీనివలన యక్షగాన విశిష్టతకు ప్రాధాన్యమును కల్పించెను. ఏకోజీ కవియు విఘ్నేశ్వర పరిణయ మను యక్షగాన నాటకము రచించెను కావున ఈ విశేషములు వ్రాయవలసి వచ్చినది.

శాహజీ రాజవంశములో క్రీ. శ. 1685 నుండి 1855 వరకు తంజావూరు ప్రాంతమంతటను యక్షగాన నాటక రచనలు, ప్రదర్శనములు బాగుగా సాగినవి.

క్రీ. శ 1780 నాటి శేషాచలపు ధర్మాపురి రామాయణము యక్ష గానమును, క్రీ. శ. 1834 నాటి ముద్దయకవి మంధెన రామయణమును రచించెను. వీరేగాక గోవర్ధనంనరసింహాచార్యులు శేషభట్టరు కృష్ణమాచార్యులు, వట్టెము పాపకవియు యక్షగాన రచనలు చేసిరి.

ఆత్మకూరు సంస్థానములో యక్షగానములు పోషింపబడినవి. ఒక గొల్ల కలాపము, ఒక కురవంజి, (రూప్ఖానుపేట రత్తమ్మ గారిది) యును వెలసినవి. నేటి యక్షగాన కవులలో కీ. శే. చెర్విరాల బాగయ్య యను కవి యనేక యక్షగానములు రచించెను.

## మహారాష్ట్రులు తెలుగు భాషను పోషించిన విధము

దక్షిణ భారతదేశ చరిత్రలో నాయక రాజుల పాలన అంతరించిన తరువాత మహారాష్ట్రులు రాజులైరి. కర్ణాట రాష్ట్రమును బహమనీ సుల్తానులు పరిపాలించుచున్న కాలములో మరాఠీలు యిచట సైన్యాధికారులుగను, దండనాథులుగను చేరి పనిచేసిరి. బహమనీ సుల్తానులకు తంజావూరు ఒక

మండలము. ఇచటినుండి మండలాధిపతులు కప్పములు గట్టుచుండిరి. 1565 లో తళ్లికోట యుద్ధము జరుగునపుడును మరాఠీలు యిచట పనిచేయు చుండిరి. బహమనీ సంస్థానాధిపతులు పతనమైరి. తంజాపూరులో అప్పటికే మరాఠీ మండలాధిపతిగా నుండెను. కావున తంజావూరు మహారాష్ట్రుల ఆధీనములోనే యుండెనని భావము వీరు సుమారు రెండు శతాబ్దములు పాలించిరి. అట్టివారిలో ఆరాధ్యుడు, ఆద్యుడనదగినవాడు శాహాజీ మూల పురుషుడు. బాబాజీ చిట్టచివరివాడు శివాజీ వరకును (1632–55) వీరందరి చేత తెలుగు భాష పోషింపబడినట్లు తెలియుచున్నది.

విజయ రాఘవ భూపాలుడు వీర మరణము చెందిన తరువాత తంజావూరు మహా రాష్ట్రుల వశమైనది. అప్పుడు రాజ్యానికి ఏకోజీ కుమారు డైన శాహజీ ఆంధ్ర సంస్కృతాది భాషల్లో గ్రంథములు రచింపజేసెను. ఇతడు స్వయముగా కవి, పండితుడు, రాజ పోషకుడు. కళాకారులను ఆదరించి, గౌరవించి, కళా సరస్వతుల పరిపోషణ చేసినట్లు భావించవచ్చును ఈ కాలమునే క్షీణయుగమనియు, హీనయుగమనియు కొందరి భావన. కాని అది సరికాదు. గోల్కొండ నాల్గవ రాజగు ఇబ్రహీం కులీకుతుబ్ షా కాల ములో తెలుగు రచనలు సాగినవి. కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయ యక్ష గానము. అద్దంకి గంగాధర కవి తపతీ సంవరణోపాఖ్యానము. ఇవేకాక తూర్పు ఆంధ్ర దేశములో కూచి మంచి తిమ్మకవి బ్రిటీషు వారి రాకపోకలకు భయపడి ఊరు (కందరాడ) విడిచి పీఠపురము చేరి కుక్కుటేశ్వరాలయమున కూర్చుండి సుమారు పద్దెనిమిది పద్య కావ్య రచనలు చేసి కవిసార్వభౌమ బిరుదు వహించెను. ఇంతటి సాహిత్యమునందించిన కాలము క్షీణయుగ మగునా?

ఏకోజీ దీపాంబికల పుత్రుడైన శాహజీ క్రీ శ. 1684–1712 మధ్య కాలములో తంజావూరు రాజ్యాన్ని పరిపాలించినట్లును, ఈ శాహజీయే క్రీ. శ. 1680 ప్రాంతములో తంజాపూరుకుతరలివచ్చినట్లును, తెలుగు నేర్చుకొని క్రీ శ. 1704 ప్రాంతములో గ్రంధరచన చేసియుంటాడని కొందరి అభిప్రాయము. ఇతడు పేరుకు మహారాష్ట్రుడు గాని నిజానికి

ఆంధ్రపరసు పస్పుడు ఏ తాత ముత్తాతలు మరాఠీలైనను, తుక్కోజి వారి పుత్రపౌత్రాదులు ఆంధ్ర భాషను పోషించినారు.

ఛత్రపతి శివాజీ తండ్రి అయిన శాహజీ తన మొదటి భార్య తొలి పుత్రుడైన సంభోజీని, చిన్న భార్య లయిన తుక్కాబాయిని తీసుకొని క్రీ. శ. 1636 లో కర్ణాటకలోని బిజాపూరునకు వచ్చెను. తోటి రాజైన మహమ్మద్ ఆదిల్ షా జాగీర్ లలో దండనాయకుగా చేరినాడు బిజాపూరు రాజు తంజా పూరునేలుచున్నట్లు ముందుగానే వ్రాసితిని. కాపున విజయ రాఘవుని పైకి దండయాత్రచేసి రాజ్యమును వశము చేసుకొనదలచి శాహజీని పంపెను. విజయరాఘవుడు ఓడిపోయెను. శాహాజీ తంజావూరును స్వాధీనపరుచుకొనెను. ఇతడు ఈ రాజ్యాన్ని తన పుత్రుడైన ఏకోజికి యిచ్చి, తాను బిజాపూరు లోనే యుండెను.

కొంతకాలమునకు యుద్ధములు జరిగి క్రీ. శ. 1656 లో కనకగిరి యుద్ధసమయములో అఫ్జల్ ఖాన్ మోసమువలన శాహాజీ తన జేష్ఠపుత్రుడైన సంభోజీని (శివాజీ అన్నను) కోల్పోయెను. శాహాజీ రెండవ భార్య తుక్కా బాయికి అంతవరకు సంతానము లేదు. ఆమెకు తంజావూరులోనే ఏకోజీ పుట్టినాడు. తండ్రి అన్నింటిని శివాజీకి అప్పగించినాడు. సవతి సోదరుడైన ఏకోజీకి తండ్రి తెలుగు విద్యలను నేర్పించెను. ఇతడు అమూల్యమైన తాళపత్ర ప్రతులను కాపీ వ్రాయించియు, కొనుగోలు చేసియు భద్రపరచెను.

ఈ ఏకోజీ క్రీ. శ. 1676 నుండి 1683 వరకు తంజావూరును పాలించెను. ఇతని భార్య తుళజాతిస్త్రీయై యుండవచ్చును. ఎందుకనగా ఇంతవరకు భోసల (భోంస్లే) వంశమువాడైన ఇతడు ఆమెకు "దీపాంబిక" అను పేరు పెట్టుకొని ప్రేమించి పెండ్లిచేసుకున్నట్లు తోచును. ఈ ఏకోజీకి 3-4 తరముల తరువాత పుట్టిన తుళజరాజు (ప్రతాపసింహుని పుత్రుడు) నుండి తుళజ వంశముగా మారినది. తొలి ఏకోజీ మూడవ పుత్రుడే (తుక్కోజీ) తులజాజీ ఈ పేరు మూలముగనే రామాయణములో పేర్కొన్న తుళజ భూపాల పదము నిలిచినట్లు కన్పడును.

శాహాజీ తుక్కోజీబాయీల వంశములో మొత్తము శాహాజీలు ఇద్దరు ఏకోజీలు ముగ్గురు - శరభోజీలిద్దరు - తుక్కోజీ లిద్దరు - ప్రతాపసింహు డొక్కడు. ఇతని కొడుకే తులజాజీ (తుక్కోజీ) యనువాడు - శివాజీ లిద్దరు. రాజు శివాజీ ఒక్కడు. అతడే ఛత్రపతి శివాజీ. చివరి శివాజీ కృతమైన "అన్నపూర్ణా పరిణయము" వలన వీరి వంశావళి కొంత తెలియుచున్నది. రెండవ శాహాజీకి చిన్న తమ్ముడైన తుక్కోజీకి కొడుకు యేకోజీ. ఇతడు స్వయముగా కవి, పండితుడు, ప్రస్తుత రామాయణ కావ్యకర్త. వీరికి బాబా సాహెబ్ అను నామాంతరము కూడ కలదు.

భోసల కలశాబ్ధి పూర్ణచంద్రుండు
భాసుర మాళోజీ పార్థివసుతుడు
సాహసాంకుడు నిత్య సత్యసంధుండు
శాహాభూపాలుండు చతుర మానసుడు
అతని తనూజుడే కావనిపాలు
డతని బాలకుడు శాహక్షితిపాలు
డతని సోదరుడు మహాకీర్తిశాలి
చతురుడు శరభ రాజన్య దేవేంద్రు
డారాజ సోదరుండతుల విక్రముడు
ధీరుండు నయశాలి దీపాంబ సుతుడు
భోశ భూపాలుండు సుగుణహారుండు
పాలిత సుజనుడు పరమపావనుడు
వసువడి తుకుజ భూపాలుడా రాజ
తనయుడు వాదేక ధరణి పాలకుడు.

అని పేర్కొనుటవలన ఏకోజీ కవి ఈ కావ్యకర్త తనను గూర్చి పేర్కొనెను. ఇతడు క్రీ. శ. 1737-39 లలో తంజావూరి నేలినట్లు తోచు చున్నది. కొందరు యితడు ఒకే సం॥ము పాలించినట్లు పేర్కొనిరి. ఈ రెండవ ఏకోజీ కృతులు రెండు. 1. రామాయణము, 2. విఘ్నేశ్వర పరి

ణయము నాటకము. ఇదియే గాక ఇంకా కొన్ని యక్షగానములో సీతి పద్యములు రచియించినట్లు డా॥ పత్తమూడి వారు పేర్కొనిరి. ఆ పద్యములు నాకు లభింపలేదు. "సంగీత సాహిత్య నాట్య ప్రియుడు", సరస సాహిత్య లక్షణ చక్రవర్తి అను బిరుదులున్నట్లు తెల్పించుచున్నది. ఈ రామాయణము నేటి వరకు అముద్రితమే. ఇందులో శ్రీరామ పట్టాభిషేకముతో సంపూర్ణమగును. రాముడు అశ్వమేధాది యాగములు చేసి, ప్రజలను సుఖముగా, సిరిసంపదలతో నిండియున్నట్లు చివరి కాండాంతములో గలదు.

## కథా సంవిధానము - అవాల్మీకాంశములు - వాని యౌచిత్యము

శ్రీరాముని విష్ణ్వంశమును వాచ్యమొనర్చినట్లును గల సందర్భము.

1. వాల్మీకి మహర్షి భూలోకములో ఉత్తమ పురుషుని గురించి నారదుని అడిగినపుడు.

దశరథ తనయుండు ధర్మమానసుడు
దశ దిశలను కీర్తి దనరిన వాడు
యినకుల తిలకుడు దేవేంద్ర సన్నుతుడు
ఘనుడు శ్రీరాముడు కల్యాణ గుణుడు

అని చెప్పెను.

2. కుంభకర్ణుని నిద్రనుండి మేల్కొలిపి యుద్ధమునకు సిద్ధము చేయగ నతడు ప్రహస్తాదులను విచారించి, విషయము గ్రహించిన వాడయి, అన్నయగు రావణునితో నిట్లనియె.

విని కుంభకర్ణుండు పలుదారి కనయ
మును రాము భార్యను ముచ్చిలి నీవు
తెచ్చినప్పుడె కీడు దెచ్చితి వధిప

అని చెప్పి అంతేగాక సీతని గరిపెను.

విరవం విరఘన వరచిత్తుదెప్ప
దరయ నాతడు కుల మంతయు జెరుచు

అని బోధించినాడు.

3. శ్రీరాముని జన్మ సమయంబును గూర్చి పేర్కొన్న విధము.

సురచిర మధుమాస శుక్లపక్షమున
పురడించు నవమికి బుధవాసరమున
మలయు పునర్వసు మధ్యాహ్నవేళ
లలిత కర్కాటక లగ్నంబునందు
గురు చంద్రయోగంబు కొమరు దీపింప
పరగనుచ్చంబులై పంచ గ్రహములు
పరమాత్మ నవ్యయు భక్తమందారు
గరిమెతో శ్రీరాముగనియె కౌసల్య

ఇట్లే భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల జన్మ వివరములు గ్రహింపబడినవి.

4 యుద్ధరంగమున విభీషణుడు కుంభకర్ణుని కెదురుపోవునపుడు కుంభకర్ణుడు విభీషణుని మెచ్చుకొన్న సందర్భమున

నా విభీషణుజూచి యా కుంభకర్ణుఁ
డావేళ సంప్రీతి ననియె నీతిగను
మనవంశమెల్లను మన్నించిబోవు
మనువంశ తిలకుని మనసురానడువు
నిలువక నా ముస్ను నీవు పొమ్మన్న

అని కన్నీరు పెట్టెను.

5. అహల్యా శాపవిమోచన సందర్భము

గరిమెతో రాగమూర్గంబున రాము
చరణ రేణువు సోకి శాపంబు మాసి

శాపవిమోచనయైన అహల్యా అంత పంపముల యెడల కప చూపిన విధానము. అందమే అన్ని యిడుములకు కారణమయ్యెనని చెప్పెను.

తొలకరి మెరుపున తులకించు మేను
తుమ్మెద రెక్కల తొలగించు కురులు
తమ్మి రేకుల మించి తనరారు కనులు
బాలచంద్రుని గెరుపాల భాగంబు
శ్రీలను రంజిల్లు చిన్ని వీనులును
ముకురముల మొసియు ముద్దుచెక్కులును
చిలికె విద్రుమముల చెనకు కెమ్మోవి
ననవిల్తు చాపంబు నవ్వు కన్బొమలు
యనలేని నూగారు నెచ్చెడినాస
దాడి విత్తుల తరము పల్వరుస
పుడమిని శంఖంబు పోలిన గళము
కాంతి లతికెనగడుగు బాహువులు
దంతి కుంభములన దనరు పాలిండ్లు
మృగరాజ మధ్యంబు మించు మధ్యంబు
జగతిలో సరియైన చక్కని పిరుదు
నరటి కంబంబులన దలచు తొడలు
మరుకాహళములనే మనెడు జంఘలును
జలజాకృతిని పోల్చు చరణ యుగ్మంబు
కలిగి యహల్య యా కౌశికమునికి
మ్రొక్కి రామునికిని మొక్కి............

అని ఆమ లావణ్య విశేషములను అతిగా వర్ణించెను.

౮. అహల్య పావనమైన విధమును చెప్పి శ్రీరాముని కీర్తించిన తీరు గన నింప దగినది.

పరమపుణ్య చరిత్ర పద్మాప్త గాత్ర
సోరది నీ పాదంబు సోకిన యపుడె
పరమ పతివ్రతా భరణంబు నైతి

యేలమి గౌతమ మునికిల్లాల నైతి
పొలిసె నా పాపంబు పొలిసె శాపంబు         అని పల్కినది.

7. మంధర కైకకు చెప్పిన దుర్బోధ విషయమున

నీ ముద్దు కొడుకును నీవును నేను
నౌకుల పంచల నుండి యెదిగిళ్ళపడుచు
తిరుగుటేగాని సుస్థితిగాంచ గలమె
నీలస్స నాలెస్స నీరజ నేత్రి
నీలేమి నాలేమి నిక్కమూహింపు

మని చెప్పెను.

8. తండ్రిమాట నిలుపుటకై శ్రీరాముని ప్రతిజ్ఞ మాటలయందు.

కాలాగ్నినైనను కరుణతో జొత్తు
కాలహాటంబైన కబళీకరింతు
జనని యిందుకు నీకు సంశయంబేల?

అని పినతల్లి కైకేయితో రాముడు చెప్పెను.

9. కైకేయి చేసిన ద్రోహబుద్ధికి కౌసల్య శ్రీరాముని చిన్ననాటి శాతక కర్మను - విధిని నిందించు సందర్భమున.

పరదేశు లెందరి పట్టణంబునను
తిరుగరు నీవట్లు తిరుగు మీ పురిని
నిరతంబు ముద్దు నెమ్మోము జూచి
మురచెద దుఃఖంబు మారామచంద్ర
నీ జన్మ లగ్నంబు నీ శుభాంగములు

నీ జాతకము జూచి నిఖిల సంయములు
భూలోక మంతయు భుజబలస్ఫూర్తి
పాలించు నితడని పలికిరిగాని
కొరమాలి మునివృత్తి గోరాటవులను
తిరుగుదువని మున్నె తెలుపలేరైరి
అని బాధతో కౌసల్య విలపించినది.

10. రాముడు అడవికి పోవునపుడు సుమిత్ర కౌసల్యలు కైకేయిని నిందించిన తీరులో.

రాకకై నీ గుండె రాయిగా వోలు
రాకుమారివి గావు రాక్షసి నీవు
పతిహిత మింతైన పరికింప లేవు
గతినీకు గలదె దుర్గతి యింతేగాని
యని నిందించిరి.

11. తండ్రిమాటను ధిక్కరించరాదని రాముడు పలికిన మాటలు.

తల్లి కైకేయి మా తండ్రి నీలాగు
యిల్లాలవై యుండి యేల చూరెదవు
తప్పను కలనైన తండ్రి వాక్యంబు.
అనెను.

12. శ్రీరాముడు అడవికి బయలుదేరగా అతనితో అయోధ్యపౌరులు సిద్ధమైరి. వారిని రావద్దని వారించిన వినరైరి. తమసను చేరిరి. రాత్రియయ్యెను. రాత్రి యగుటనే నిద్రించిరి. ప్రజలు నిద్రించుచుండగ అర్ధరాత్రిరాముడు తన రథమును అయోధ్యకు పంపి, తాను అడవికి పోవుచున్నప్పటి మాటలు.

జనులార విడిచి మీ సంసారములను
చనుదేర యుచితమే చనుదయోధ్యకును

అని చెప్పగా ప్రజలు రామునితో.

భరతుడేలను మాకు భవనంబులేల
పరలదు నీమీది మమతలు మాకు —అనిరి.

13. ప్రజల నోదార్చి శ్రీరాముడు తమసను, వేగవతిని, సరయు నదులను దాటి, గంగా నదిని చేరి కేల్మోడ్చి నమస్కరించెను. తెల్లవారినదని ప్రజలులేచి రామునివెదకిరి. ఎంతకు కనిపించనందున రథము పోయిన మార్గమున ప్రజలు పోయిరి. ఆ సందర్భములో కవిలోని భావన ప్రజల వ్యథను గ్రహింపవచ్చును.

చెంతను మేల్కాని శ్రీరాము వెదకి
గానక రథ చక్రగతుల చొప్పరసి
మానవేశ్వరు నాజ్ఞమనరామచంద్రు
డరిగె నయోధ్యకు నని నిశ్చయించి
పురజనుల్ సాకేత పురి కేగుదెంచి.

14. శ్రీరాముని బాణము చేత హతుడైన వాలిని (తన భర్తను) చూచి తార విలపించిన తీరు.

ఓ రాఘవేశ్వర యో మహావీర
ఊరకె వాలినిట్లొగి చంపతగునె
నీనీతి నీమతి నీదు విఖ్యాతి
జానకి వెంటనె జనియెనో చెపుమ
దేవేంద్ర నందను తెగటార్చునట్లు
దేవ నన్నిప్పుడు తెగటార్చు మనుచు
శోకింపుచును తన సుతుని యంగదుని
చేకొని తలకుచు చింతింపుచుండె.

అని ఈ కవి ఇతర కావ్యములలోవలె శపింపలేదు. విలపింపినది. ఆయనవీరత్వమును ప్రశ్నించినది?

15. విభీషణుడు రావణునకు బుద్ధి చెప్పుటకు ప్రయత్నించుటలో చక్కని నీతిని గ్రహింపవచ్చును.

విను రాక్షసేశ్వర విక్రమోదార
చనటి మంత్రుల మాట చెవి బెట్టవలదు
దేవిని లంకకు దెచ్చిన మొదలు
దేవ యీ పురలక్ష్మి దీనయై పొలిచె
తోచుచున్నది మహా దుర్నిమిత్తంబు
లేచందమున జూడ నిది బుద్ధిగాదు
జనకజ గొంపోయి సరగున రామ
జనపాల మణినిచ్చి శరణంబు జొరుము
నీవంశ గరిమెను నీ జీవములను
నీవారి నెల్లను నీవు రక్షింపు
మని చిలుకకు చెప్పినట్లు ముమ్మారు
చనిబుద్ధి యా విభీషణుడు చెప్పినను
విని రావణుడు కోపవివశుడై జూచి
తన తమ్ముడనకను తన్నె తన్నుటయు
.... .. .. .... ... . ........ .. .
తలపుము నా బుద్ధి తలపున నన్ను

అని తాను చనిపోయిన సరియె కాని వంశమును నాశనము చేయకుము. దేవిని తిరిగి యిచ్చి రాముని శరణు వేడుమని పల్కిన సందర్భము మిక్కిలి యుచితముగా నున్నది.

16. రావణునితో హనుమంతుడు పోరుచుండగ, వాయునందనుడు రావణుని పిడికిట పొడివగా నతడు మూర్ఛిల్లి, తేరుకొని హనుమంతుని పరాక్రమును మనసార పొగడిన తీరు గమనింపదగినది.

వడిచేర్చి రావణు వక్షమ్మునపుడు
పిడుగుతో సరిమైన పిడికిట బొడువ
వడి మూర్ఛజెంది వెంబడి మూర్ఛ దెలిసి
అదరుచు రావణుండనిలజను జూచి
నీలావు కొండాడ నేనెంతవాడ
మేలు పావని నిన్ను మెచ్చితిననిన

ఆని ఆంజనేయుని పొగడిన విధము మనోహరముగా నున్నది.

17. రావణు నాదేశానుసారము భటులు కుంభకర్ణుని నిద్రలేపిరి అతడపుడు

శ్రీరాముచే ముక్తిచేకొన గోరి
దూరంబుగా నిద్రద్రోసిన మాడ్కి
ప్రళయ కాలాగ్ని బింబంబుల బోలు
కలయంగ నెఱ్ఱని కన్నులతోన
కను విచ్చియసురులు కంపింప మేలు.

ఆని కవి కుంభకర్ణునంతటి వానిచేత పల్కించినాడు.

18. శ్రీరాముడెన్ని బాణములు వేసినను, రావణుడు మరణింపకుండు టయు, రాముడలసిపోవుటయు చూచిన విభీషణుడు రావణుని మరణ మర్మమును రామునకు చెప్పుట యందు,

"దేవ రాఘవ వీడు తెగడెందుచేత
వావిరి సుధనాభిపడియుండజేసి
అనల బాణంబేసి అమృత మింకించి"

రావణుని వధించుమని చెప్పెనట. ఇట్లు గ్రహించినచో అనేకములు గలవు. కావున యింక వివరములు చాలింతును

దేశకండములో రామాయణమును సరళముగా వ్రాసి, తెలుగు మాతృ భాషగా లేని ఏకోజీ మహారాజు మహానుభావుడు.

ఈ రాజకవి వ్రాసిన ఈ మహాకావ్యమును లోకమునకు పరిచయము చేయుటయే నా మహా భాగ్యముగా భావింతును. దీనివలన సాహిత్యకముగా, ఆముష్మికముగా కృతార్థుడ నైనట్లుగా నా విశ్వాసము. దీనిని పరిశీలించిన పండితులకు కూడ యిట్టి భావన కల్గితే నా శ్రమ ఫలించినట్లే. నా తెలివి కొద్ది దీనిని పరిష్కరించిలిని. ముద్రణలో కొన్ని అచ్చు తప్పులు దొరిలినవి. విజ్ఞులు నన్ను మన్నింతురని ప్రార్థించువాడను

శ్రీముఖ ఉగాది
భాగ్యనగరము
తేది: 24-3-1993

బుధజన విధేయుడు

**డా॥ మొ[illegible]ంగపల్లి భాగయ్య**

# కృతజ్ఞతలు

'రామా' అనగానే పాపముల నుండి విముక్తి చేయువాడు రాముడు అనే యర్థము స్ఫురించక తప్పదు. ప్రతి ప్రాణి తెలిసితెలియక చేసిన తప్పులు సరిదిద్దుకొనుట మానవ ధర్మము దశాబ్దికాలము నాటి మాట ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు నా మీద గల వాత్సల్యము చేత నాకొక సూచన నిచ్చి యుండిరి అది డాక్టరేటు పట్టా పొందాలని చెప్పిరి. వారి ఆజ్ఞను శిరసా వహించి నేను అనేక రకముల గ్రంథములను ఏకలవ్యునివలె జూచితిని ఏ మహానుభావుడు నన్ను దరిచేర్చని కాలములో దివాకర్లవారు నన్ను నాయనా! మీరు ఏకోజి రామాయణముపై Ph. D. చేయుమని చెప్పిరి వారి మాటలు పాటించి నేను ఆ గ్రంథ సేకరణకు బయలు దేరితిని. ఎవరో ఒకరు అవధాని గారికి తటస్థపడి వారు అడిగినంతలో ఈ ప్రతిని నాకిప్పించిరి ఆ తరువాత APGOML&RI పురా సంచాలకులు డా॥ వి.వి.యల్. నరసింహారావుగారు ఈ గ్రంథమును వ్రాసుకొనుటకు అనుమతించిరి ఆపై డా॥ వి వి. కృష్ణశాస్త్రి గారు అనుమతించిరి వీరందరికి నా ధన్యవాదములు

నా గురువర్యులు ఆచార్యులు ఎం. కులశేఖరరావు గారు నాకన్ని విధముల అండదండలుగా నిండు మనస్సుతో నన్ను దీవించిరి. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ గ్రంథములు రూపము దాల్చుటకు శ్రీ వేంకటేశ్వరుడే దయదలచెను. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఆర్థిక సాహాయ్యము చేసి యున్నారు. వారికి నా ప్రత్యేక ప్రణామములు.

ఇంకెందరో ప్రత్యక్ష పరోక్షములలో సహాయపడిరి. వారందరికీని నా హృదయపూర్వక నమోవాకములు.

బుధజన విధేయుడు

**ఎం. బాగయ్య**

# బాలకాండము

శ్రీ గణనాథునాశ్రిత పారిజాతు
బాగుగా నుతియించి వాక్సిద్ధికిపుడు
శ్రీ శారదాదేవి చిత్తాంబుజమున
బాసిల్లఁ బ్రార్థించి భక్తితోడుతను
వాసవ ప్రముఖ గీర్వాణ వందితుని
భోసలాన్వయ రాజ పూజితపదుని
ఫాలనేత్రుని భక్తపాలునిఁ జంద్ర
మౌళీశ్వరుని దయామానసుఁ దలచి—
వ్యాస శుకాదుల వర్ణించి కాళి
దాసాది కవులకుఁ దగఁ గేలుమోడ్చి
కులదైవతమ్ములఁ గొనియాడి మదినిఁ—
బొలుపొందు సత్కవి బుధుల సమ్మతిని
భోసల కలశాబ్ధిఁ బూర్ణఁ జంద్రుండు—
భాసుర మాళోజిఁ బార్థివ సుతుఁడు
సాహసంకుడు నిత్య సత్యసంధుండు
శాహ భూపాలుండు చతురమానసుఁడు
అతని తనూజుఁడే కాపనీపాలుఁ
డతని బాలకుఁడు శాహక్షితి పాలు
డతని సోదరుడు మహాకీర్తిశాలి
చతురుఁడు శరభ రాజన్య దేవేంద్రుం
డారాజ సోదరుండతుల విక్రముఁడు
ధీరుండు నయశాలి దీపాంబ సుతుఁడు

పోశ భూపాలుండు సుగుణహారుండు
పాలిత సుజనుండు పరమ పావనుఁడు
పనువడి తుళుజ భూపాలుఁడా రాజ
తనయుఁడు వాఁడేక ధరణి పాలకుఁడు
యతుల ప్రాసంబుల నర్థసంగతుల
ప్రతిలేని నవరస భావముల్ దనర
నిరుపమాలంకార నియతు లేర్పడగ
నరుదుగా వాల్మీకి యలరామ కథను
రచియించినట్లు సారముగాఁగ ద్విపద
రచియింపఁ దత్కథాక్రమ మెట్టిదనిన
ఘన తపస్స్వాధ్యాయ కలిత మానసుని
ముని నారదుని జూచి ముదమునఁ బలికె
భువిలోన నిపుడతి పు(ణ్య)నరుండు
(డెవఁడు) సద్గుణ శీలుడెవఁడు కృతజ్ఞు
డెవఁడు వీర్యంబున నెనలేని వాఁడు
నెవఁడు ధర్మజ్ఞుం డెవడు విద్వాంసు
డెవఁడు దృఢవ్రతుండెవఁడు సత్యజ్ఞుం
డెవఁడు సామర్థ్యంబు నెసఁగినవాడు
జీవాత్మకులను రక్షించు వాఁడెవఁడు
భావజ నారుడెవఁడు అట్టి వాడెవఁడు
యెవఁడు జితేంద్రియుండెవడు నసూయుఁ
డెసఁడు జితక్రోధుఁ డెవడాత్మ వంతు

జేవదబ్ధి గంభీరుదెవఁడద్రి ధీరుండు
నెవని వంపున నెలమి రాక్షసులుఁ
దలఁకుచు దీనులం దాఁగు చుండుదురు
తలిఁదండ్రి భక్తి సంతతము గొల్చుచును
నిం(ద్రాదు)లకు (దుర్నిరీక్ష్యు) ఁడెవడు
చంద్రశేఖరు భక్తి సలుపు వాఁడెవడు
కనుకొన యిటువంటి గుణములవావి

ముని (లోనవందిత) ముద మొప్ప ఁదెలుపు
అనవిని నారదుం డానందమొంది
మునుకొని వాల్మికి ముని కిట్టులనియె
సూర్య వంశాబ్ధి భాసుర జాతుడాతఁ
డార్య సమ్మతుఁడు రామాభిధానుండు
నియతాత్ముఁ (డనఘుడు) నీతికోవిదుఁడు
దయగల వాడఁతి ధర్మ (ని) ష్ఠుండెఁవడు
ముద్దు మాటలవాఁడు ముదితలోకుండు
పెద్దల యెడభక్తి పెంపొందువాఁడు
యెక్కువ కీర్తుల నెనసిన వాఁడు
ఆజాను బాహుండుదగ్ర సూనుండు
రాజీవ నేత్రుఁడు రాజసింహుండు—
ఆచారవంతుండు నాత్రపాలకుఁడు—
వాచాలకుఁడు సత్యవాక్య పాలకుఁడు
పెంపొందు భుజబలమ్ములుఁ గలవాఁడు

జలధి గంభీరుండు శైలధీరుండు
ఘన శత్రు మద గజ కంఠీరవుండు
తనవారి పాలింపు దాత సద్గుణుఁడు–
సరస విస్తార వక్షమ్ముగలవాఁడు
సౌరది లక్షణముల శోభిల్లువాఁడు
పెలుపైన లక్ష్మని పొందినవాఁడు
పలుమారు సుజనుల పాలించువాడు
సురుచిర సర్వాంగ సుందరుండిలను
సరసిజ సంభవ సముత్తముఁడు
సకల శాస్త్రాగమ సారకోవిదుఁడు
అకళంక గుణముల సమరిన వాఁడు
ప్రియదర్శనుఁడు గంభీర సాగరుఁడు
నయశాలి కౌసల్యా నందనుండెలమి
విక్రమంబున త్రివిక్రమ సముఁడు
చక్రవైభవుడు భూ క్షమగలవాఁడు
అను కోపమున కాలాగ్నిరుద్రుండు–
దానంబులందున ధనద సన్నిభుఁడు
దశరథ తనయుండు ధర్మమానసుఁడు
దశదిశలను కీర్తి దనరినవాఁడు
యినకుల తిలకుఁడు దేవేంద్ర సన్నుతుఁడు
ఘనుఁడు శ్రీరాముడు కల్యాణగుణుఁడు
పురుషోత్తముఁడు సంపూర్ణావతారు

దరయంగ జన్మించి యభివృద్ధి పొంది
తాటకి వధియించి తనర యజ్ఞంబు
నాటకంబుగాఁ గాచి వనితలకాహల్య
శాపంబు తొలగించి చంద్రశేఖరుని
చాపంబు దునిమి యా జనకజ పెండ్లి
యాడి భార్గవ రాము నవలీల గెలిచి
పోడిమి సాకేత పురమును జేరి
తన తండ్రి పంపున దండ కాటవికి
జనకజా లక్ష్మణ సహితుడైఁ పోయి
పరగ విరోధినిఁ బరి మార్చివేగ
(శరభంగ మౌని గని సత్వరంబునను)
మాయా మృగంబైన మారీచు చంపి
పాయకను నీవు పట్టంబు గట్టి
కట్టించి సేతువు కడలిని దాటి
కొట్టి రావణు యేర్చు కుంభ కర్ణుండేను
శరణు జొచ్చిన విభిషణు లంకయందు
కరుణతో పట్టంబు గట్టి అంతటను
యవనిజతో పుష్పనారూడు డగుచు
రవివర రమణియై నా రామచంద్రుఁడు
తమ్ములతో నయోధ్య పురిచేరి
నమ్మిన వేడ్కతో బహు వైభవముల
చుట్టు పక్కములతో శోభిల్లియపుడు

పట్టాభిషిక్తుడై ప్రజల పాలించె
నని జెప్పి నారదుండద్భుతంబుగను
చనియె చేరుక బ్రహ్మ సదనంబున బం
చిన (కుసుమాసనుండైన) వాల్మీకి కళంకతో
నంత తన శిష్యుడగు భరద్వాజుతోను
తమసా నదికి బోయి తడయక స్నాన
మమర గావించి శుద్ధాత్ముఁ డై రాగ
నెదుటను క్రౌంచముల్ యిచ్చనుప్పొంగి
మదనుకేళిని గూడి మలయుచు నుండ
బోయ యొక్కఁడు బాణమును పొంచివేయ
హా యని మొగ పక్షియటు పడ జూచి
కుపితుడై వాల్మీకి కుటిల కిరాతు
శపియింప నప్పుడు శాపాక్షరములు
తడయక నాల్గు పాదములలోను
పుడమినిపద్యమై యొప్పెనంతటను
విని శిష్యులెల్లను విస్మయంబంది
యను వొంద పఠియించి రా పద్యమంత
మును నాథుడాశ్రయమ్మున నేఁగుదెంచి
వనజ సంభవుఁడందు వచ్చిన జూచి
యెదురేగి వాల్మీకి యెఱుగెమునులకు
....వినిపించి మునుల దీవెనల
వొదయుచు సాకేత పురికేగి రాము

చదురున జేరి తచ్చరితంబు వారు
వినుపింప శ్రీరామ విభుడుత్సహించి
వినుచుండె తత్కథా విధమెట్టి దనిన
శ్రీకర గుణముల క్షీరాబ్ధిరీతి
సాకేత పురమొప్పు సరయువు పొంత
వానరంగ ద్వాదశయోజనాయత
మును పంచ యోజనముల వెడల్పగుచు
కనక గోపురముల కనక సౌధముల
కనక తోరణముల కనక గేహముల
పొడవైన కోటల పూల తోటలను
పుడమి శైలంబులంబోలు మేడలను
రాజమార్గంబుల రమ్య కూటముల
తేజరిల్లుచు రత్న దేవాలయములు
సామజహయ భట స్యందనమ్ములను
వామ లోచనల సర్వాంగ సుందరుల
ప్రథితమై యొప్పె నా పట్టణంబునకు

నధిపతి దశరథుడను మహారాజు
మున్నూట యాబది మునులాతనికి
మున్నూటివారి నోముల జేసె కౌసల్య
కమలజ నెలత కైకయా రాజపుత్రి
కమనీయ శశివక్త్ర కాంత సుమిత్ర
సుతులు శోభిల్లి త్రిశక్తులోయనఁగఁ
ఖాతని పురోహితులు ధాత్రిశ దేవేంద్రు
నగతు పితులగు వసిష్టాది సంయములు
మతిమంతు తెనమంత్రుడు మంత్రులాతనికి
సరసులైనట్టి యాసచివులతోన
గురుతరంబైన సద్గుణములతోన
చిరకీర్తి దశరథ క్షితిపాలమౌళి
విరివిగ ప్రజలెల్ల వెయినోళ్ళ పొగడ
కరుణించి నీతితో కార్యముల్ దెలిసి
ధరణి పాలించ నాతని రాజ్యమందు
హీనుండు కొండీడు హింసాభిరతుడు
దీనుండు జడుఁడు సందేహమానసుఁడు
జారుండు కృపణుఁడు శఠుఁడు నక్షరుఁడు
చోరుఁడఁ దయుఁడలసుండు కృతఘ్నుండు
పరువడి జనుల లోపల వేద్కజూడ

ధరణీశు లందరు తను భజింపగను
సకల వైభవముల( సామ్రాజ్యమేలి
యొకనా(డు దశరధుండుల్లంబునందు
తనకు సంతతి లేమి తద్దయువగ(చి
వినవరులైనట్టి సచివులంజూచి
తల్లి గర్భంబు హీనతా(బుట్టి (న) మొదలు
నెల్ల లోకులకును హితమాచరించి
సకల దానంబుల సకల ధర్మముల
సకల భోగమ్ముల సకల సంపదల
నెనలేక నింద్రాదు లెల్లనుతింప
ననుపమ సత్కీర్తిన్ నార్జించుకొంటి
తాను దేవబుజంబు తగ ఋషి ఋణము
దానయాగముల చేత తగ దీర్చుకొంటి
కొడుకులు లేకున్న కువలయంబునను
వొడమి పితృఋణంబు పులయుదుగాన
సరస సంతతిలేని సంపదలేల
సరస సంతతిలేని సౌభాగ్యంబులేల
సరస సంతతిలేని సామ్రాజ్యమేల
సరస సంతతిలేని జన్నంబులేల
నటుగాన యిపుడూనే యశ్వమేధంబు
ఘడియించి మరి పుత్ర కామేష్టిజేసి
తనయుల బడయుదు దార విక్రముల

ననిన వసిష్ఠాదు లౌనసనిరంత
మతిమంతుడైన సుమంతుండు జేరి
క్షితిపతి జూచి మచ్చికతోఁబలికె
నరనాథమున్ను సనత్కుమారుండు
గరిమె రహస్యమొక్కటి దెల్పియుండె
విన్నవించెద నదివిను రోమపాదుఁ
డన్నవతోడుతనంగ రాజ్యంబు
వెలయ నేలుచు ననావృష్టి దోషంబు
కలిగిన వెరచి యా కలుషంబుధీర
చేడెలచే ఋష్యశృంగు దెప్పించి
తోడ ననావృష్టి దోషంబులనఁచి
తన కూతు శాంతనాతని కిచ్చునతని
దనరంగ దెప్పించి దశరధేశ్వరుఁడు
యెలమితో పుత్ర కామేష్ఠి జేసినను
నలువురు కొడుకులున్నప పుత్రికములు
కలుగుదురని చనె కావున మును
పిలిపింపుడాతని సంప్రీతి నసంప
విని సంతసిల్లి యుర్వీపతి ఋష్యశృంగు
డును కృపా శాంతా సమేతుఁడు
కరమొప్ప పూజించి కరమును మెచ్చి
వరరత్న పీఠిని వసియింపఁజేసి
మునినాథః నా పుణ్యమున నుపత్పాద

వనజము గంటి పావనుడైతినిపుడు
మునిసంతసిల్లెనప్పుడు వసంతంబు
చనుదేర దశరథ జనపాలుండలరి
మునివశిష్ఠాదుల ముదమొప్పగూడి
దనరంగనశ్వమేధంబు గావించి
శ్రీరాజితుడు ఋశ్యశృంగుచే పుత్ర
కామేష్టి గావింప గనిరి దేవతలు
రావణబాధ కోర్వక పద్మభవుని
సేవించి వెతలన్ని జెప్పిన నతడు
వానరులతో గూడి వచ్చి ముచ్చటగ
కారుణ్యజలధినికని ఇందు ధరుని
దేవాది దేవుని దీనవత్సలుని
భావించి సేవించి భక్తితో మ్రొక్కి
యతనితో కార్యంబు లన్నియు జెప్ప
యతని సమ్మతిని బ్రహ్మాది దేవతలు
మలయు రత్నాంకిత మకుటంబుతోన
లలిత కాంచన కుండలమ్ములతోన
పుటమ నాయక భట (గ)జములతోన
చెలగు వక్షస్థల శ్రీదేవితోన
కలితాంబు నీలమేఘంబు చందమున
విలసిల్లు నల మహావిష్ణువు జూచి
శరణాగత త్రాణా సర్వలోకేశ

ప్రతిలేని వానరపతుల ధూర్తులను :
పుట్టివుండెయున్కి పుట్టించినాఁడ
నెట్టన బలపయోనిధి జాంబవంతు
ననవిని సురలు నిజాంశంబులందు
జనియింపజేసిరి సకల వానరుల
దశదిశాయత కీర్తి దనరారు చుండు
దశరథ భూపాలు తరుణుల కెల్ల
నప్పుడు గర్భంబులభివృద్ధిజెందె
గొప్పలై కాయముల్ కొమరు దీపించె(చి)
చెక్కులు దెల్లనై బిగియించెనుచన్ను
ముక్కులు నల్లనై మురువువహించె
చిక్కెనెమ్మేనులు చెలువైన కోర్కె
లక్క బొంచెవుగాల్చిన రుచి జనించ
అలనట దోప రాయంచల తోటి
పలుమారు జేరియీప్పబడలికల్ పొడమే
చులుకనలైనట్టి సొమ్ములే కాని
దళమైన సొమ్ములు దరియింపరైరి
చెలియలు చిలుగైన చీరలేగాని
కలయ బంగారు కోకలు కట్టరైరి
నెలతల నీరీతి నెలలు పన్నెండు
పొలిచిన మిగుల నద్భుతముగా నపుడు
సురుచిర మధుమా(స)శుక్లపక్షమున

పురణించు నవమిని బుధవాసరమున
మలయ పునర్వసు మధ్యాహ్నవేళ
లలిత కర్కాటక లగ్నంబునందు
గురుచంద్ర యోగంబు కొమరు దీపింప
పరఁగ నుచ్చంబులై పంచగ్రహములు
పరమాత్మునవ్వయు భక్త మందారు
గరిమెతో శ్రీరాముగనియె కౌసల్య
పొలుపొందు శుభకర పుష్య నక్షత్ర
కలితమౌ మీన లగ్నంబున గరిమ
పూని కేకయపుత్రి పుణ్య యోగమున
భాను సన్నిభతేజు భరతీశు గనియె
కలితాహి నక్షత్ర కటక లగ్నమున
తలఁపుల్లసిల సుమిత్రా దేవి కవల
లక్ష్మీకరా కారా లక్ష్మణాన్వితుల
లక్ష్మణ శత్రుఘ్నులను గాంచెనపుడు
తిరముగా మ్రోగెను దేవదుందుభులు
సొంపైన పుష్పవానలు సోనలై కురిసె
సంతోసిల్లెను దేవ సంఘంబులెల్ల
సంతసంబందిరి సకల భూప్రబుద్ధులు
జననాధుడు పుత్రోత్సాహంబుతోన
ముని వశిష్ఠుని వేదజ్ఞ మునివరుని రప్పించి
కనికరంబున జాతకర్మముల్ జేసి

ధన ధేనువు రత్న ధాన్య సంతతుల
పరుఁడు బోయినయంత పుత్రుల కెల్ల
గరిమె తోడుత నామకరణముల్ జేసి
భూరి గంధవస్త్ర భూషణంబులను
వారు వీరనక నవ్వారిగా నొసఁగె
బాలింతలప్పుడు బాలుల నెలమి
పాలింపుచుండిరి బాలులంతటను
కల్లరి నగవుల ఘనవిలాసములఁ
పిల్లారి మొక్కుల వేర్పు విద్యలను
జిలిబిలి సుద్దుల చిన్ని ముద్దులను
గళల సోయగముల కడు వేడుకలను
దొలల తల్లిదండ్రులకు నెపుడు
బాలలీలల జూపి శోభిల్లి వారు
నిరుపమ చాలోప నియతు నైపుణ్య
చరితులై రామ లక్ష్మణులును భరత
శత్రుఘ్నులును జోడు నడలక మిగుల
మిత్రత్వము నా సుధార్మికులు తురంగ
గజరధారోహణ క్రమములు దెలిసి
భుజ బల శౌర్య విస్ఫూర్తులు పెంపలి
సకల వేదమ్ములు సకలశాస్త్రములు
సకలమంత్రములు సంధింపెరపును
విలసిల్లు తనయుల వీక్షించి నృపుఁడు

చెలువు మీరగ పెండ్లిసేయ నూహింప
నంత విశ్వామిత్రుఁడుదేర భూమి
కాంతుడెదురు చని కడగి తోడ్తెచ్చి
అలరార నర్ఘ్య పాద్యాదుల నొసఁగి
చెలగి సింహాసనాసీను గావించి
దీన విధాయ గాధేయ నీ మహిమ
పూని శేషునికైన పొగడంగ తరమె
దేవర సత్కృపా దృష్టినిజేసి
పావనుడైతిని ఫలియించె తపము
వచ్చిన పనియేమి వరుసతో తెలుపు
మెచ్చుగా నదియెట్టిదైనను గాని
జేసెదననిన కౌశికుఁడుత్సహించి
బాసిల్లి దశరథ పార్థివుకనియె
రావణు వనువున రాక్షసాధములు
వేవేగ నాయాగ విఘ్నంబు సేయు
చున్నారు వారల నుక్కడగింప
వప్పుగా మరయక్ష వధుఁబొంగుడు
తిరమొప్పకోదండ దీక్షా గురుండు
ధర్మపుణ్యుఁడు రామచంద్రుండు దక్ష
కావున నీ పెద్దకుమరుని రాఘవుని
నావెంట బనుపుము నకట మనసున
యెదబడి కార్యంబులేమి తోచదను

పెదవులు దడపుచు పృథ్వీశుడనియె
పరగ పండ్రెండేండ్ల బాలుడీరాముఁ
డురుతర మర్మంబు లూహింపలేడు
యెక్కడ దైతేయు లెక్కడ రాముఁ
డక్కజంబుగ వీరి కజగజాంతరము
నీవెంట నేవచ్చి నీచ రాక్షసుల
వెవేగ వధియింతు విచ్చేయు మనిన
వినికాల రుద్రుని విధమున మదిని
కదలుచు నున్న యా కౌశికుఁజూచి
చేరి భూపతితో వసిష్ఠుడిట్లనియె
కార్యంబంతయు కలయ నూహించి
సృష్టివారలకు కౌశికుఁడు పూజ్యుండు
సృష్టికి ప్రతిసృష్టి జేయడె తొల్లి
యీతని వెంబడి నిపుడె రాఘవుని
భూతలేశ్వర బంపుపొందుము కౌతుకము
లనవిని దశరథుండాత్మలో [illegible]
పనుపడి శ్రీరాముఁబ్రేమ [illegible]
రావయ్య రాఘవ రవివంశ[illegible] సోమ
రావయ్య నాపుత్ర రాజీవనేత్ర
[illegible] మహాముని వెంట నీవిప్పుడె కదలి
యా మహాయజ్ఞంబు [illegible]
మునుల యాశీర్వాదముల బొందెదసుమ్ర

ఘన జయలక్ష్మిని గైకొనిరమ్మ

పొమ్మన రాముడుప్పొంగి తండ్రికిని
నమ్మతి తోడుత సాష్టాంగ మెరగి
గురు వసిష్ఠునకు మక్కువ వందనంబు
గరిమెను గావింప కళ్యాణమిపుడు
యౌగాక యని మునియాశీర్వదించి
సొగుమికనని తోన విశ్వామిత్రు కనియె
బాగుగా శ్రీరామ భద్రుని గూడి
యాగంబు గావించి యచటనొక్కింత
సిలువక తోడ్తెమ్ము నృపకుమారకుని
చెలువుతో విజయమ్ము సేయుమటన్న
నంత విశ్వామిత్రుండా రామచంద్రు
నెంతయు సౌమిత్రినెనసి కౌశికుడు
వుదయించు చంద్ర సూర్యుల మెరుగైన
నుదయాద్రి చందాన నొదిగి తానపుడు
ఉద్భిక స్వాశ్రయ మార్గంబు బట్టి
ఖచ్చుచో నెదుటను వదిన రాశించి
వరసైన వుదరంబు వల్ల వెంద్రుకలు
విరివైన కన్నులు వెలుదచన్నులును
ముదిగొన్న మేనును ముద్దుపాదములు
పొడవైన మోకాళ్ళు పొదిరాలు నొక్క
కదగి కాటుక కొండకరణి దీపించి

శూలంబు గైకొని చురుకు చూపులను
కాలాగ్ని కణములు గ్రమ్ముచు చెదర
పటపట బ్రహ్మాండముల్ పగుల
కటకట కొరుకుచు కటు దంతములను
పటు తరార్భటి తోడ పరతెంచు పడతి
తాటక గనినంత తపసి కౌశికుడు
రామలక్ష్మణులతో రయమున బలికె
యీ మహారాక్షసి యింద్రాది సురుల
హింసత భీతిల్లి నేసెదీనినిట
యనిలోన వధియింపనగు కీర్తిసికు
ననవిని రఘురాముడా మహామౌని
వినయ వాక్యంబులు వినిసమ్మతించి
గురిగొన్న నెరిచిప్ప కూకటి కదల
శరము చాపమున సంధించి పొంచి
తమ్మునితో గూడ దశరథ తనయుం
డమ్మహా రాక్షసి యదర బాణమున
తాటకి వధియింప దేవదుందుభులు
పొటిల్లి మ్రోగె దిగ్భగంబులందు
కురిసె పువ్వులవాన కువలయంబునను
గరిమె రాముని మౌనికౌగిటం జేర్చి
కుతుకంబుతో చిప్పకూకట దువ్వి
హితుడైన రాముని వీక్షించి పలికె

శ్రీరామచంద్ర! యాశ్రిత పారిజాత!
వీరావతార! సువిక్రమ స్ఫూర్తి
దానవి వధియించి దనరలోకముల
నానిన భయములణంచితి విపుడు
మసలక మావంటి మౌనుల బ్రోచి
వసుధ పాలింపుచు వర్ధిల్లు మనుచు
దీవించి యిచ్చెను దివ్యాస్త్రములను
భావింప రఘుపతి భక్తి గైకొనియె
అరయ కౌశికుడు నిజాశ్రమంబునకు
సరగున రామలక్ష్మణులతో వచ్చి
యాగ దీక్షవహించి యమ్మహామౌని
యాగంబు గావింప నావేళ దెలిసి
పరగ మారీచ సుబాహులు వచ్చి
వెరవించుచును యజ్ఞవిఘ్నములన్ జేయ
రామలక్ష్మణులంత రాక్షసాధముల
భీమబాణంబుల పేర్చియేయుచును
మానవాస్త్రంబున మారీచునీచు
పూనియంబుధిలోన పొలుపొందజేసి
అతి భయంకరమగు నాగ్నేయమునను
పతితుడైనట్టి సుబాహుని గూల్చె
యావేళ కౌశికుడధ్వర పూర్తి
గావించి రాముని కౌగిటజేర్చి

సౌమిత్రి కొనియాడి సరసరీతిగను
రామచంద్రుని జూచి రంజిల్లననియె
బలియుండు జనక భూపాలుడుత్తముఁడు
దెలుపుగా యజంబు సేయు చున్నాడు
కనుగొందమనుచు కౌశికుండపుడు
జననుత రామలక్ష్మణులతో కదలి
మంతుకెక్కిన యాశ్రమముల జూచుచును
కొంతదూరముపోయి కొమరొప్పునెదుట
సారనీర గభీర సారసక్రౌంచ
కారండవానేక ఘనరాజహంస
సురుచిరనినద భాసుర దళమౌచు
సరస కల్హార విస్తార పరాగ
పరమశీతల మందపవమాన చరిత
పరిపూర్ణ జలచరోద్భాసితోత్తుంగ
వీచీవిరాజిత విమల జాహ్నవిని
జూచి రాముడు గాధిసుతున కిట్లనియె
ఈ మహానది నిలకెత్తెనెవడు
సమ్మానమున దెచ్చె సాహసమునను
పలుమారు పుణ్యపావము లేర్పరించి
యేలుచున్నది గాదె యిలహంసరీతి
కడువేడ్కతో కాలకంఠుని జటల
మేడల రాజిల్లు మృదుచంద్రికగను

మురువున విలసిల్లెముక్తి పద్ధతికి
పరువగ వ్రజ సోపానంబురీతి
స్థిరమైన పుణ్య కాశీపురలక్ష్మి
కరుదైన మౌక్తికహారంబు మాడ్కి
నీనది మహిమ మాకెరిగింపుమనుడు
పూని కౌశికుడు రామునిచూచి పలికె
విను రామ మును మహావీరుండు సగరుఁ
డిన వంశజుఁడయోధ్యనేలె నాతనికి
కులకాంత లిద్దరు గుణరూపవతులు
కలరు వారిని గూడి కలుగక సుతులు
హిమవంతమున కేగి యిందఱ తపము
కమనీయముగ జేయ కడుమెచ్చి భృగుడు
నరనాథ పెక్కండ్రు నందనుల్ నీకు
సరస గుణాఢ్యులు జనియింతు రనఘ
పొమ్మన్న సగరుడుప్పొంగి కేల్మోడ్చి
కొమ్మలతో వచ్చె కూర్మితో పురికి
అతిరూపకేశిని యనునగ్ర మహిషి
మతిహీనుడగు నసమంజుని గనియె
భావింప సుమతియన్ భామినిగాంచె
వేవేగ యర్వదివేల నందనుల
నసమంజుడంతట నచట బాలురను
వెససరాయువులోన విసరచు నుండు

సశ్వరక్షకులంత నవనీశుతోడ
వశ్వంబు పొడగాన మన విస్మయింప
సదరి మహీపాలుదర్వదివేల
కొడుకుల హయము గన్గొని తెండటంచు
పనిచినవారలు బ్రహ్మాండమంత
పనిచిన కనుగొని యశ్వంబు గనక శూలముల
గినుక నార్చుచు మహాగీర్వాణలోక
ముల జూచి గానక మొనసి శూలములు
ద్రిప్పుచు దక్షిణ దిక్కుగానేగి
తప్పని దీక్షకు తలమంత్రతపి
చలమున జొచ్చిరసాతలంబునకు
విలసిల్లు కపిలుని వెన్కనశ్వంబు
గని వీడె ముచ్చని గర్జింపసతడు
కసలుచు కాలాగ్ని కణముల్ దసర
తెగువతోడుత నుగ్రదృష్టిచే జూడ
సగరులర్వదివేలు సమసిరంతటను
పుడమీశుడప్పుడు పుత్రులురాక
తడసిన వెరగంది తగనంశుమంతు
పనిచిన నాతడు భువనమంతయును
కనులతో ద్రవ్వుచు కానకవాం
వచ్చి యాకపిలుని వద్దనశ్వంబు
నచ్చుగా దానితో సమీపముగ

పడియున్న సగరుల భస్మంబు జూచి
యడలుచు తిలకంబుకై జలమచట
వెదకుచు నుండ భూవిభుని సుతుడు
సదయుడై గరుడుండు చనుదెంచి బలికె
వలదు శోకింప భూవరముక్తి వీరి
కెలమి కల్గనుపాయమేను జెప్పెదను
పరమేష్ఠి మెప్పించి పరమపావనిని
సరిపాద సంభవయైన యా గంగ
రప్పించి యా భస్మరాశిని తడిపి
నప్పుడె మీ తండ్రులగుదురు ముక్తు
లనవిని హాయమును నంశుమంతుడును
కొనితెచ్చి సగరుతో కొడుకుల తెరగు
చెప్పిన శోకించి శీఘ్రమాయాగ
మప్పుడే నెరవేర్చియప్పుడే కదలి
పగలురేల్ తపము ముప్పది వేలయేండ్లు
సగరుఁడు గావించి చనియే నద్దివికి
అప్పుడు గంగకై యంశుమంతుండు
ముప్పది వేలేండ్లు మొనసితపంబు
గావించి పరగతి గాంచెనంతటను
దేవి జాహ్నవిని నేదెచ్చెదననుచు
యారాజనందనుండగు భగీరథుడు
ఘోరతపంబు గైకొని వనంబునను

విరివిగా ముప్పది వేలేండ్లుజేసి
పరువడి స్వస్వరూపము బొందెనంత
యా విభునందనుండగు భగీరథుఁడు
రావించి మంత్రుల రాజ్యమందునిచి
ధనర్థ గంగనుదెత్తు తాతల గాంతు
ననివనంబున కేగియతి ఘోరతపము
శావిధి పదివేల వత్సరంబులును
గావింప వచ్చి యా కమలజూడంత
తథమె యా గంగను దాల్పనన్యులకు
పరమేశ్వరుఁడు దక్క పార్థివనాథ
శివుని గూర్చి తపంబు చేయుమటన్న
నవిరళ భక్తితో నా భగీరథుఁడు
తపము జేయగమెచ్చి తరుణేందుమౌళి
యపుడు తా ప్రత్యక్షమైవచ్చి నిలువ
కని భగీరథుఁడిరు కరములు మోడ్చి
కనికరమును గౌరి కాలకంఠుని పద
సరసిజములవాలి సాగి మ్రొక్కుచును
పరువడి ప్రార్థింప పరమేశుడనియె
మనుజేశ నీయభిమతమెల్ల తెలిసె
తనయుల నిచ్చితి ధరియింతు గంగ
తెప్పింపు మన బ్రహ్మదేవుని యాజ్ఞ
తప్పక యా గంగ ధరణికేతేర

కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగేంద్రుల సాధ్యపతుల గంభీర
జయజయ శబ్దముల్ జగమాక్రమింప
క్షయమొందమనుజుల పాపసంఘములు
పరువడితో పెనుపంచలై పాఱ
మురువైన శీకరమ్ములు మింటికెగయ
చండతుంగ తరంగ చటులడిండీర
మండలామిత నక్రమత్స్యకూర్మాది
జలచర భీకర స్వనపరంపరల
మలగి సకలమౌ బ్రహ్మాండముల్ కలగ
సర్వ సర్వంసహా చక్రంబు పగుల
గర్వంబుతో వచ్చి గంగానదీయట
సొరది శంకరు జటా జూటంబు జొచ్చి
మురువుతో సందు డె మూర్తీభవించి
సంత భగీరథుండతని ప్రార్థింప
శంత విద్వేషిచక్కగ నొక్కజటను
వదలింపభూమికి వచ్చి యాగంగ
పొదలి భగీరథ భూపాలువెంట
చని జాహ్నముని యజ్ఞశాలగొంపోవ
కనలి జాహ్నుడు వచ్చు గంగ నొక్కటను
పానంబు చేసిన పరగరా గంగ
కానక నృపతియా మునుజహ్నువేడ

నవనీశుభ క్తిక్రైయలరుచు కర్ణ
వివరమార్గంబున విడిచినయంత
నానాట మొదలు జాహ్నవియనబరగె
నూనిగ భ క్తితోసుభయతీరముల
సకల గీర్వాణులు సకల సన్మునులు
సకల భూసురులును సకల యోగీంద్రు
లానదీ స్నానంబులప్పుడే జేసి
దాన ధర్మంబులు తగనాచరించ
భావింప నాజన్మపరిశుద్ధులైరి
వావిరి తల్పితృ వర్గంబు లెల్ల
ఓపించి శుద్ధులై దివికేగిరపుడు
భూవలయంబెల్ల పొల్చె సస్యముల
సిరితియాగంగ యెలమితో వచ్చి
సిః ఖిలా జొచ్చి నిమిషమాత్రమున
పడుపడి సగరుల పాపముల్ తొలగ
నిరుపమ జలములు నిండార నిలిచె
నిలిచి సంతట వచ్చి నీరజోవృవుడు
సెలమి భగీరథు నీక్షించి పలికె
వినుభగీరథ జగద్విఖ్యాత చరిత
నినబోల నేర్తురే నృపతులిభువిని
నుల సగర మహీశుంతంశు మంతుండు
నెఁగి కీలీషుండు కేసిన ప్రతిన

సాధింపలేరైరి జగతి నాప్రతిన
సాధించితివి నీవు జాహ్నవిఁ దెచ్చి
పలుమారు నీపేర పావని గంగ
తిలకించి భాగీరథీయన బరగు
జలనిధులును భానుచంద్రులెందాక
కులగిరి నక్షత్రకోటు లెందాక
వేదశాస్త్ర పురాణ వితతులెందాక
మేదిని జాహ్నవి మెలగు నందాక
పొలుపుగా భువిలోన భోసలాన్వయము
నలయక వర్తించు నభివృద్ధిగాంచు
శంకరాకృతులను చరియింతురనుచు
వంకలేని చరిత వర్తిల్లుదురనె
నా భగీరథుడంత నపర కర్మముల
నభయముగా జేయ నాసగరజులు
దివ్య భూషణముల దివ్యాంబరముల
దివ్య గంధముల దివ్యమాల్యముల
దివ్యరూపంబుల తేజరిల్లుచును
దివ్యరథమ్ముల తెరగొప్పనెక్కి
యవనీశ కులమణియగు భగీరథుని
తివిరి దీవింపుచు దివికేగి రప్పు
డంత కృతస్నానుడైన భగీరథుడు
సంతోషమున నేగె సాకేతపురికి

కులకామినులతోన కొడుకులతోన
నెలమితో సామ్రాజ్యమేలుచునుండె
ఘనమైన శుభపుణ్య కలితమై శ్రీల
దనరారు గంగావతరణమాహాత్మ్య
మెచ్చుగా తుకజేంద్రుడు మేదినీశునకు
నిచ్చు సత్పుత్రుల నిచ్చుపౌత్రులను
హెచ్చుగా సౌభాగ్యమిచ్చు జయంబు
లిచ్చు దీర్ఘాయుష్యమిచ్చు రాజ్యముల
నిచ్చువైభవముల నిచ్చుసత్కీర్తి
లిచ్చు కామ్యాదులనిచ్చు సద్భక్తి
నిచ్చు సద్గుణములనిచ్చు శౌర్యముల
నిచ్చు సామజముల నిచ్చు నశ్వముల
నిచ్చు దైవంబులనిచ్చు సౌఖ్యముల
నిచ్చు సదాచార మీపుణ్యచరిత
మెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవ్వరు వ్రాసిన నెవరు జూచినను
భువిలోన వారికి పుత్రసంపదలు
నవిరళ భక్తులు నతుల శౌర్యములు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసు రంజిలజేయు మానినీమణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యముల్ కలుగు
ధరణిలో నాచంద్ర తారార్కముగను

యిరుపొంద నిష్టార్థమిచ్చు సీగంగ
దురిత సందోహముల్ తొలగించు గంగ
యీ నదీస్నానంబు నింపొందజేయు
పూని శోభనములు పొందు శ్రీరామ
యనిన కౌశికుని వాక్యములాలకించి
ఘనమైన భక్తితో కాకుత్స్థతిలకు
డమ్మహానదిలోన నను జన్ముతోన
సమ్మానమున గాధిజాసితులగుచు
గరిమతో రాగమార్గంబున రాము
చరణరేణువు సోకి శాపంబుమాని
నెలకొన్న చిత్రమై నెలతయై ముందు
తొలకరి మెరుపున తులకించుమేను
తుమ్మెద రెక్కల తొలకించు కురులు
తమ్మి రేకులమించి తనరారు కనులు
బాలచంద్రుని గేరుఫాల భాగంబు
శ్రీలను రంజిల్లు చిన్నవీనులును
ముకురముల మొనయు ముద్దుచెక్కులును
చికిలి విద్రుమముల చెనకు కెమ్మోవి
ననవిల్తు చాపంబు నవ్వు కన్బొమలు
యెన లేనినూగారు నెచ్చెడినాస
దాడివిత్తుల తరము పల్వరుస
పుడమిని శంఖంబు పోలిన గళము

కాంతి లతికైన గడుగు బాహువులు
దంతి కుంభములన దనరు పాలిండ్లు
మృగరాజ మధ్యంబు మించు మధ్యంబు
జగతిలో సరియైన చక్కని పిరుదు
నరటి కంబంబులన దలంచు తొడలు
మరుకాహళములనే మనెడు జంఘలును
జలజాకృతిని పోల్చు చరణయుగ్మంబు
కలిగియహల్యయా కౌశికమునికి
మ్రొక్కి రామునికిని మ్రొక్కి యిట్లనియె
జయజయ రఘురామ జగదభిరామ
జయ దశరథపుత్ర దవళాబ్జనేత్ర
సురముని జనమిత్ర సురుచిరగాత్ర
పరమపుణ్యచరిత్ర పద్మాప్తగాత్ర
సౌరది నీపాదంబు సోకినయపుడె
పరమపతివ్రతా భరణంబు నైతి
యెలమి గౌతమమునికిల్లా నైతి
పొలిసెనాపాపంబు పొలిసె శాపంబు
కరుణించు మీవేళ కరుణాపయోధి
శరణాగతత్రాణ జయరామచంద్ర
యనికొని యాడంగసద్ఫలంబుగను
కనికరంబుగవచ్చి గౌతమమౌని
కౌశికుకొనియాడి ఘనరాము పొగడి

విలసిల్ల కోర్కెలు భామనుగూడి
యనువొంద జనియె నిజాశ్రమంబునకు
ఘనుఁడు కౌశికుడు రాఘవులతోఁగూడి
మేదినీశు జనకు మిథిలకు వచ్చి
ముదముతో శ్రీరామమూర్తితో ననియె
పొలుపైన దేవేంద్రపురమున కన్న
మెలగుచున్నదీ మిథిలాపురంబు
విలసిల్లు కోటలు వెలయు పేటలును
పొలుపొందు శూరులు పూల తోటలును
గౌర రత్నముల చెక్కడపు గేహంబు
లరుదైన బంగారు హర్మ్యసంతతులు
నైరావతంబుల నణగించు కరులు
మారులేనట్టి సాంద్రాణి తేజీలు
సిరివైన నిధులును విపణి మార్గములు
సరసిజ సంభవసములు విప్రులును
సమరసింహంబులు క్షత్రియోత్తములు
రమణీయ మూర్తులు రాజనందనులు
నలకాధిపతికి జోడైన వర్తకులు
పాల ముఖాన్యైశ్వర్యులగు శూద్రవరులు
కలిగి శోభలు దీని కంటివే రామ
పలికి సన్నుతిజేయ శేషుని తరమె
యనుచు విశ్వామిత్రుడానందమునను

తొలగించి హర్షించి ధూర్జటివిల్లు
వరుసతో కనుగొనవచ్చియున్నారు
హరువిల్లు దెప్పింపుమన నీశయిపుడె
యనవిని జనకుండద్భుతమంది
ముని కౌశికుని జూచి మొనసి యిట్లనియె
శ్రీ సదాశివుచేత చెలగె నీచాప
మా సదాశివుబోలు నతనికిగాక
యితరులచే నిదియెక్కుడ తరమె
ప్రతిలేని సౌరాష్ట్ర బంగాళ గౌళ
మాళవ నేపాళ మగధ కాశ్మీర
చోళ కేరళ పాండ్య సురుభిర సింధు
లాట కర్ణాట మరాట కుంతల వి
రాట కళింగాంగ రమ్యకాంభోజ
కురుబర్బరారట కోసల హైమ
గురుతర కొంకణ మూర్జర ప్రముఖ
ధరణీశు లెల్లను ధనువెత్త లేక
వెరచి నెవ్మఱితోన విస్మయంబంది
యున్నారు వీక్షింపు మొగిముని చంద్ర
చిన్ని బాలకులు యీక్షితిపాల సుతులు
హరుచాపమెత్తెడు నతనికి సీత
వరగ నిత్తుఁటంచు ప్రతిన జేసితిని
యని లోహమయము దీప్తాష్టచక్రంబు

ఘనశైలనిభము భీకరమాయతంబు
హరువిల్లు మిథిలేశుండపుడు దెప్పించి
వరతపోధనునా విశ్వామిత్రుజూచి
ధనువు దెప్పించితి తగరాఘవునికి
కనుబంపుమని నయా కౌశికుండపుడు
శ్రీరామచంద్రు నీక్షించి యిట్లనియె
వీరాధివీర యీ విల్లెక్కువెట్టి
కరమర్ధిసీతను గైకొనుమనిన
చిరునవ్వుతళుకొత్త చెలగి రాఘవుడు
కరిరాజు చెరకున ఖండించు మాడ్కి
పరువడి హరుని చాపము ద్రుంపనపుడు
పెళపెళ ధ్వనుల చెప్పి దివి కంపించె
కళగె దిగ్భాగముల్ కలగె నంబుధులు
జనక కౌశిక రామచంద్రలక్ష్మణులు
వినగ లోకము లెల్ల వివరంబులయ్యె
నంత విశ్వామిత్రుడాత్మనుప్పొంగి
సంతసంబున రామచంద్రు దీవించి
శిరమును మూర్కొని చెక్కిలి పుడికి
కరమర్ధికొనియాడి కౌగిట జేర్చి
కవికులాంబుధి సోమరామలింగను
శివుదయచాపంబు చేకొని విరిచి
సురది శౌర్యస్ఫూర్తి జూపితి విపుడు

పరువడి జనక భూపతి సంతసిల్లి
మనత తోడనుండ కౌశికుజూచి
వినుము గాధేయ నా పితత ప్రతిజ్ఞ
ఫలియించె శ్రీరామభద్రునివలన
కలకంఠ సీత రామునికిత్తుననుచు
దశరథు పిలపింప తగిన మంత్రులును
విశదంబుగా బంపవేగమే వారు
సాకేతపురిజేరి సతతంబు నుతుల
రాకకోరెడి దశరథరాజు జూచి
జననాథవినుమేము జనక మంత్రులము
పనుపడి కల్యాణ పత్రిక గొనుము
సామిమీ తనయులు చతురమానసులు
రామసౌమిత్రులు రవిచంద్రవిభులు
తాటకి వధియించి దనర కౌశికుని
మేటి యజ్ఞము గాచి తొలుతయహాల్య
శాపంబు తొలగించి జనకు పట్నమున
యేమునున్నారు యెలమి రాముండు
హరుభీమ కార్ముకంబవలీల ద్రుంచ
పరువడి జనక భూపతి సంతసిల్లి
తనపుత్రి సీతను దన రామునికిని
కనకరంబుగ నీయ కాంక్షించినాడు
పరగ కల్యాణ వైభవము వీక్షింప

గడిమెతో సిప్రౌఢై కదలి రమ్మన్న
ఘనిపంక్తిరథుడు భావించి హర్షించి
జనక భూపాలుని సచివుల కపుడు
కనక భూషణముల కనకాంబరముల
ధనవాహనంబుల దనరగా నొసగి
యంతట దశరథుండల రాముపెండ్లి
చెంతయు కనుకొని చేరి దీవింప
హితమంత్రి జనపురోహితులు బాంధవులు
చతుర ధీమంతులు సామంత నృపులు
కవులు గాయకులును ఘనవైణికులును
నవమోహనాంగులు నటులును భటులు
కుల వృద్ధులును వంశగురు వశిష్ఠులు
తిలకింప నలరామదేవాది ఋషులు
దురమున వెన్నిని దుర్గాధిపతులు
సరిలేని వర్తక జనులు పౌరులును
మునుకొని చనుదేరు ముత్తైదువులును
ఘన విక్రమంబులు గలచిత్రమాల్య
చిత్రభూషణములు చిత్రాంబరములు
చిత్రాత పత్రముల్ చిత్రధ్వజములు
చిత్ర చామరములు చిత్రాయుధములు
చిత్రవైఖరులును చిత్రరేఖలును
కలిగి శోభిలి మత్తకరుల కొందరును

వలగొని యుత్తమాశ్వముల కొందరును
పొలుపైన మణిరథంబులను కొందరును
కొలది విభారిన పల్లకులను కొందరును
సరసతొనె తెరసైన్య మధ్యమున
యిరువంకలందు భద్రేభంబు లెక్కి
భరత శత్రుఘ్నులు భక్తితో గొలువ
చంద్రప్రభా భాస సమల సద్వ్రజ
సాంద్ర శోభిత సితచ్ఛత్రంబు వసర
బహురత్న కాంచనోద్భాసిత దండ
మహనీయ ధవళ చామరములు వీవ
వందిమాగధులు కైవారముల్ సేయ
దుందుభి పటహాస సందోహ మృదంగ
శంఖాది శుభవాద్య చారుఘోషములు
పుంఖాను పుంఖమై భోరున దిశల
ధంధణుతయనుచు తరుచుగా మ్రోయ
గంధ బంధుర గజస్కంధంబు నెక్కి
తలకొన్న వేడ్కతో దశరథేశ్వరుడు
తిలకించి రెండువ దేవేంద్రుడనగ
తేజరిల్లుచు వచ్చె దివిజులు జూడ
రాజిల్లు జనకుని రాజధానికిని
జనకుడు నెదురేగి సచివులతోన
చనవున దశరథేశ్వరు జూచి యపుడు

యనువొందఁ గుశలంబు లడిగి తోడ్తెచ్చి
జనపతికుచితోపచారముల్ జేసి
నరనాథ దశరథ నాపుత్రినిపుడు
నిరుపమ బటుడగు నీ కుమారునికి
నిచ్చి పెండ్లికిని నిన్నిటు పిలుపింప
వచ్చితివిప్పుడు పావనుండైతి
మొనసి వసిష్టాది మునులసేవింప
తన జన్మమీడేరె తలపు చేకూరె
యినవంశజులతోన నిపుడు సంబంధ
మనువొందఁ దలఁపియింతెసతి ధన్యుడైతి
ననవిని దశరథుడాత్మనుప్పొంగి
జనకుని జూచి యో! జననాథ నీవు
జన్మశుద్ధుఁడ ద్వైత మతివినీవయ్యా
రాజవంశాంబుధి రత్నంబు నీవు
నీతోడ వియ్యంబు నే సేయగంటి
భూతలేశ్వరులలో పూజ్యుండనైతి
ననుచుండనంత విశ్వామిత్రమౌని
ఘనులైన రామలక్ష్మణుల తోడ్తెచ్చి
యప్పంక్తి రథునకు నాశీర్వదించి
యొప్పగింప కౌసూళ్ళనుబ్బి భూవిభుడు
మొనసి పాదములకు మ్రొక్కుచునున్న
తనయులనిద్దరి తగ కౌగిలించి

కొనియాడి కౌశికు కూరిమి బంధు
జనరాజపరులతో సభనుండువేళ
మెరయ వశిష్ఠుండు మిథిలేశుజూచి
సౌరది పావనము యీ సూర్యవంశంబు
సత్యదయాచార శౌర్యాదిగేహ
మత్యంత సుగుణాఢ్యులర్క వంశజులు
మనుజేశ జనక యీమనుకుల క్రమము
వినిపింతు వీనులవిందుగా వినుము
పరమేష్ఠికిని తనూభవుండు మరీచి
మరి మరీచికి పుట్టెమహాని కశ్యపుండు
కౌతుకు కశ్యపుని కర్కుండాతనికిని
పడిని జన్మించె వైవస్వతమనువు
యతనికి నిక్ష్వాకుండతనికి కుక్షి
యతనికి వికుక్షియతనికి బాణుం
డతనికి ననరణ్యుండతనికి పృథుండు
చతురుడాతనికి త్రిశంకుండాతనికి
సతతపుణ్యుండు హరిశ్చంద్ర భూమీశు
డతనికి యువనాశ్వుండను రాజవర్యుం
డతనికి మాంధాతయను నందనుండు
చతురుడైనట్టి సుసంధి భూమీశుం
డతనికి ధ్రువసంధి యతనికి భరతు
డతనికి ససితుండు నతనికి సగరుం

డతనికి సమంజసుండతని తనూజుఁ
డతులిత మతిమంతుండంశుమంతుండు
నతనికి పుత్రుడు దిలీపావని నాథుం
డతడు భగీరథుడను రాజు గనియె
నతని కయ్యె కకుస్థుండతనికి రఘువు
ప్రతిలేని కల్మాష పాదుండాతనికి
జనియించె నతనికి శంఖనుండతని
కనువొంద జనియించె నాసుదర్శనుఁడు
నతనికి జనియించె నగ్నివర్ణాఖ్యుఁ
డతనికి శీఘ్రగుఁడతనికి మరువు
యతడు ప్రశుశ్రుతుండను రాజు గనియె
నతండంబరీష మహారాజు గనియె
సుతుండాతనికిని నహుషుఁడాతనికిని
సుతుఁడు యయాతి వసుధరాధీశుఁ
డతనికి నాభాగుడా రాజమౌళి
కతులిత గుణశీలుఁడజుఁడుద్భవించె
యతనికి దశరథుండాత్మజుండయ్యె
చతురుడౌ దశరథక్ష్మాపాల మౌళి
సరసులు శ్రీరామచంద్ర సౌమిత్రి
భరత శత్రుఘ్నులుద్భవించి రధివ
తొల్లిసి సేయు నిస్తులపుణ్య మహిమ
నల్లుడాయను రాముఁడన నంతసిల్లె

జనక నృపాలుఁడా జనకానుమతిని
ముని వసిష్ఠుని జూచి ముని శతానందు
డనువొంద జనక రాజాన్వయ క్రమము
వినుఁడని వివరించె విస్తరంబుగను
ధర్మశీలుఁడు మహీదారుఁడు త్తముఁడు
నిర్మలాత్ముఁడు పుట్టె నిమిచక్రవర్తి
యతనికి మిథి నృపుండతనికి జనకుఁ
డతనికి కుదావసుండా మహీపతికి
నందనుండై పుట్టె నందవర్ధనుఁడు
పొందుగా నతనికి పుట్టె సుకేతుఁ
డతనికి దేవరాతావనిపాలుఁ
డతనికి జనియించె నలబృహద్రథుఁడు
యతండు మహావీరుఁడను రాజుగనియె
సుతుడతనికి గల్గె సుధృతి భూమీశు
డతనికి జనియించె నాదృష్టకేతుఁ
డతనికి హర్యశ్వుఁడతనికి మరువు
తనయుఁడయ్యెను ప్రతీంధకుఁడా మహీశు
డనువొంద కీర్తిరథాధిపుంగనియె
నా మహీపాలున కలదేవమీఢుఁ
డా మహాత్ముఁడు విబుధాదీశు గనియె
నతఁడు మహీంద్రకుఁడను సుతుగాంచె
నతనికి కీర్తిరాతావనీనాథుఁ

దతనికి కర్గెమహారోముఁడెలమి
నతనికి స్వర్ణరోమాఖ్యుఁడు తనయుఁ
డతనికి హ్రస్వరోమావనీ పాలుఁ
డతనికి జనియించిరతుల విక్రములు
చతురులీ జనక కుశధ్వజాధిపులు
నతిపావనంబు యీ యన్వయంబనుడు
వినివసిష్ఠాదులు వెయినోళ్ళపొగడ
వానర సౌమిత్రికి నూర్మిళాకన్య
భరతునికి గుణాభరణ మాండవిని
నిరుపమ శత్రుఘ్ననికి శ్రుతకీర్తి
నిమ్మన సంతోషమినుమడింపగను
సమ్మతి తోడుత జనక భూవిభుడు
పురము సింగారింప పుత్తెంచె నపుడు
పరిచారకులవారు పట్టణంబెల్ల
సహకార పల్లవ జలజ కహ్లార
మహిత తోరణముల సవరించిరంత
గరిమైన దిన్నెల కస్తూరి నలికి
మురుపైన ముత్యాల ముగ్గులే తీర్చి
ఘుమఘుమవాసనల్ గుబుల్ కొనంగ
హిమజలంబులు జల్లిరెలమి వీధులను
ధూపధూపిత హేమ తుంగ సౌధముల
దీపింప రత్నాల దీపఁబు లిడిరి

కనక భిత్తికలపై కమనీయ చిత్రపఙ్క్తు
లనువుగా వ్రాయించి రమ్యతంబుగను
దివ్యభూషణములు దివ్యాంబరములు
దివ్య గంధంబులు దివ్యమాల్యములు
పరువడి ధరియించి వార జనంబు
లరుదుగా జరియించి రధ్వరమునకు
యంతవసిష్ఠ విశ్వామిత్రమునుల
సంతసంబున జూచి జనకుఁడిట్లనియె
వొసరంగ నిట వివాహోచిత క్రియలు
ననువొంద గావింపు డన వసిష్ఠుండు
దశరథు రప్పింప దశరథేశ్వరుఁడు
విశదంబుగా శుభవేళ సంతటను
తనయుల చేతను తగిన దానముల
నొనర సేయించెనప్పుడవ్వాని కొరకు
మంగళ స్నానముల్ మహిత హోమములు
సంగతిగా నొగిస్నాతక వ్రతము
లరయంగ చేయించెనంత రాఘవులు
వఁపూర్ణ శక్తులు భావజాకృతులు
చకచకద్యుతి రత్న చయసముల్లసిత
మకుటముల్ దాల్చిరి మస్తకంబులను
మురువైన కుండలమ్ములు వీనులందు
వర×ఘాటమ్ముల బసిడి బాసికము

లనువొంద వక్షస్థలాంతరంబులను
తనరారు ముత్యాల దండలు మెరయ
నురుబాహువులను కేయూరముల్ వెలయ
కరపద్మములను కంకణములు చెలఁగ
కనకాంబరంబులు కనక సూత్రములు
కనులందు పొదులగ కమనీయలీల
తనువుల యెదుగు గంధపు పూతలను
ననువుగా వెలగొంది యాకృతిగొన్న
పురుషార్థముల రీతి పొలుపొంది రపుడు
నా రాజనందనులద్భుతముగను
జనక నృపాజ్ఞను సైరంధ్రులెల్ల
ననుపమ రూప సీతాది కన్యలకు
కై సేయ చెలగిరా కన్యకామణులు
వాసించు మధుమాస వాసరారాము
సీమల తిరుగురా చిల్కలో యనగ
కోమలంబగులత కూనలో యనఁగ
మెరుగారు తొలకరి మెరుపులోయనఁగ
సరిలేని కంతుని శరములో యనఁగ
వలికెడి కాంచన ప్రతిమలో యనఁగ
యలరామ మదరాజ హంసలో యనఁగ
కనక భూషణముల కనకాంబరముల
కనక నూతన సుమకలిత హారముల

కనకాంగు లొప్పిరా కన్యలలోన
జనక తనూజాత జగదేకమాత
కనకలతాదేహ కల్యాణగేహ
లలిత గుణ వ్రాతలలనయా సీత
చెలఁగి రూపంబున శ్రీ లక్ష్మిగాఁగ
అంత వసిష్ఠాదులగు పురోహితులు
సంతసంబున లగ్న సమయఁబటంచు
జనకునికిఁ దెల్పి జనకాను మతిని
దశరథుతో దెల్పి దశరథేశ్వరుఁడు
విశదముగా నుండ వివశాత్ముఁడగుచు
తనయులతో బంధుతతులతో నాప్త
జనులతోడత సంతసంబునరాఁగ
జనకుఁడెదుర్కొని సంప్రీతితోన
జననాథు తోడెచ్చి సపినయోక్తులను
ఫలిత రంభా స్తంభ బహునారికేళ
కలితామ్ర పల్లవ ఘనతోరణాంక
చిత్రకవాట భాసిత చతుర్ద్వార
చిత్రాంకితామిత శ్వేత వితాన
మహనీయ కల్యాణ మంటపవేది
నహిమాంశకులులు రామాదులతోన
విడియించి తానంత వేదోక్త విధిని
కడుపడి హోమంబు గావించి పిదప

సరసత మధుపర్క సమయంబు దీర్చి
కరమొప్ప సీతాది కన్యకామణుల
రావించి వారిలో రాజిల్లు చున్న
దేవిని సీతను తెరమరుంగునకు
నెలకొన జేసివర్ణిత గుణుండగుచు
పొలుపొంద సంకల్పపూర్వకంబు గను
సద్ధర్మ చారిణి జలజాతనేత్రి
యిద్దరా పుత్రిని యిపుడు శ్రీరామ
శ్రీకర గుణధామ సీతాభిరామ
చేకొనుమని యగ్నిసిద్ధ సమ్మతిని
సకల గీర్వాణులు సకల సన్మునులు
సకల బాంధవు లెల్ల సన్నుతి సేయ
ధారబోసెను దేవతలు సాక్షిగాఁగ
ధారతోడుత వర్షధారలు గురిసె
దివినుండి మ్రోగెను దేవదుందుభులు

రవివంశ మెల్లను రంజిల్ల నంతటను
సౌమిత్రి కూర్మిళ సరస మాండవిని
ఆమర సాక్షిని తగ భరతునికి
శతకీర్తి కన్యను శత్రుఘ్ను నికిని
కుతుకంబుతో జనకుఁడు ధారబోసె
సురుచిర మంగళ శోభకంబులను
విరివిగా భామినుల్ వినిపించిరపుడు

నరుదారలాజవ హోమాదులు వేల్చి
వరవధూమణులు కేవలము శోభిల్లి
రంత విశ్వామిత్రుండా వైభవంబు
లంతయు కనుగొని హర్షించి మిగుల
జనకులి దశరథక్ష్మాపాల మణిని
కొనియాడి చనె హేమ కుటీరంబునకు
జనకుండు సకల రాజన్యులనపుడు
మనసు రంజిల్ల సన్మానముల్ జేసి
తగిన బాంధవులకు దశరథేశ్వరుని
కగణిత వస్తువాహనముల నొసఁగి
శిష్టులైనట్టి వసిష్ఠాది మునుల
కిష్టార్థముల నిచ్చి హిమకరాన్వయుడు
పదివేల గజములు పదివేల హయలు
పదివేల ధేనువుల్ పదివేల రథము
లరణంబుగా తనయల్లుండ్లకిచ్చి
వరువడి జనక భూపాలుఁడు పొంగి
మొనసి యంతఃపురంబున కేగికూర్మి
తనయుల కనుగాని తగుబుద్ధి జెప్పి
యరుదైన భూషణాంబరముల నిచ్చి
చిరుతలైనట్టిదాసీ జనంబులను
కరమర్థితో నిచ్చి కడగి దీవించి
వరగ కన్నుల యందు బాష్పముల్ గ్రమ్మ

తప్పక కూతుండ్ల దశరథు చేతి
కొప్పించి మిథిలేశుఁడుచితోక్తి బలికె
నిన్నాళ్లు నాయింట నీరజముఖులు
కన్నియల్ పెరిగిరి గారవంబునను
తప్పితప్పిదములు దనర జేసినను
తప్పుమెప్పులుగాఁగ దయసేయవయ్య
అనిజెప్పి బనిచిననౌగాక యనుచు
ఘనువున దశరథేశ్వరుఁడుత్సహించి
తనబాంధవులతోన తనయులతోన
మొనయ వసిష్ఠాది ముఖ్యులతోన
దనర కోడండ్రతో తన రాజధాని
కనువొంద చనుదేరనచట మార్గమున
విడివడి సుడిగాలి వీచె దిక్కులను
పొడమెను భయములు భువనముల్ కలగె
నడిబూచి దశరథుండతి భీతిమనసు
బెదరి నిల్చినను వసిష్ఠు డిట్లనియె
దరనీశ నీకింత దద్దిల్లనేల
వేరంపు పుట్టును వెంటనే పొలయు
ననుచుండ మిగుల రౌద్రాకృతితోన
కనుగవ కోపాగ్ని కణములతోన
సమర భీకరమైన చాపంబుతోన
కొమరైన చెమట జేగురు మోముతోన

పరభయంకరమైన పరశువుతోన
సరిలేని నిడుద కెంజడ గుంపుతోన
పరశురాముడు రాగ భయమంది నృపుడు
తరుచుగా నర్ఘ్యపాద్యాదులు గొనుచు
నెదురేగి దశరధునెంచక నతండు
వదరుచు శ్రీరామ భద్రుని జూచి
శ్రీరామ నాచేత చిక్కితి విపుడు
నీరాజసంబెంత నీశౌర్యమెంత
యిరువది యొక్క మారెలమి రాజులను
పరిమార్చి పేర్చిన బంటను నేను
ఘనమైన భూమిని కశ్యపాదులకు
దనర నిచ్చిన మహాదాతను నేను
కడు జీర్ణమైన ముక్కంటి చాపంబు
కడిమి నీ వెక్కిడి గర్వించి తివ్వి
డీవిల్లు చేకొని యెక్కిడుము మన్న
నావిల్లు చేకొని యతని సత్వంబు
రాదీసె దశరధరాజ నందనుఁడు
సాదరంబుగ వింట సంధించి శరము
కాకుత్స్థకులుఁడు భార్గవ రాముజూచి
నీకాళ్లు తెగవేతు నిలువు మటన్న
పరశురాముడు భంగపడి రామువేడి
శరణాగతుఁడంత తప్పు సహియించి

పాయక నాపుణ్య పంక్తుల మీద
నేయుమటన్న తానేసె రాఘవుఁడు
తప్పక దశరథాత్మజుని దీవించి
యప్పుడు భార్గవుండరిగె నంతటను
ఘన జయ లక్ష్మిని గైకొని రాముఁ
డనఘుల కులవసిష్ఠాదుల కెరగి
తన తండ్రి దశరథధరణీశ్వరునికి
దనరు సద్భక్తి వందన మాచరింప
శ్రీ రాఘవుని రెండు చేతులెత్తి
గారవంబున తన కౌగిట జేర్చి
శిరము మూర్కొని ముద్దు చెక్కిలినొక్క
పరమ సంతోష సంభరితాత్ముఁడగుచు
కొడుకుల కోదండ కూర్మి బాంధవుల
తడయక తోడ్కొని దశరథేశ్వరుఁడు
కలశ పయోరాశి కరణి సంపదల
పొలుపొందు సాకేత పురమును జేరి
రాజ వీధుల రాగ రాజీవముఖులు
రాజిల్లు నవరత్న రమ్యహర్మ్యముల
మలయుచు పెండ్లి కొమరులనుజూచి
చెలువైన ముత్యాల సేసలు జల్లి
పరమ పుణ్యాంగనల్ పరగ దీవించ
హరువుగా రత్నాల హారతులెత్త

పొలుచు విప్రులు హేమ పూర్ణకుంభముల
నెలమితో గైకొని యెదురుగా రాగ
తగిన మంత్రులలోన తనయులలోన
నగరు ప్రవేశించి నరనాథుఁడపుడు
గరిమె కౌసల్య కేకయ రాజపుత్రి
వరుస సుమిత్రాది వారిజ నేత్రు
లెదురేగి కొడుకుల నెలమి కోదండ
పొదలుచు జూచియుప్పొంగి ముత్యాల
సేసలు జల్లి రాజీలు పళ్ళెరముల
రాసుతులకును హారతు లెత్తువారు
వందనంబులు సేయ వారల నెత్తి
పొందుగా దీవించి పొదివి కౌగిటను
రామ కల్యాణ వార్తలు నా ప్రజనులు
వేమారు వినుపింప వినుచుండిరంత
ధరణీశుఁడపుడు యుధాజిత్తువెంట
భరత శత్రుఘ్నుల బనిచె మోదమున
బలిమిని కలిమిని ప్రతిలేక నృపుఁడు
చెలువుగా రాజ్యంబు సేయుచునుండె
రవివంశమణియైన రామ చంద్రుండు
యువరాజ్య పదమున యుండి నీతిగను
తల్లియుతండ్రియు తానెయై ప్రజల
నెల్ల పాలింపుచునేపు దీపించి

శీతాంశు ముఖియైన సీతతో గూడ
జాత రూపోజ్జ్వల సదనంబులందు
నారామ సీమల హర్మ్యసంతతుల
శ్రీరమ్య శృంగార సీమ దేలుచును
విభవ సంపదలతో వెలయుచు నుండి
శుభమూర్తిముదమున సుఖియింపుచుండె

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

యనిభోసలాబ్ధి సుధాంశుఁడుత్తముఁడు
ధన నాథతుల్యుఁడు దార విక్రముఁడు
సరస సాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుఁడీ కవి కల్పకంబు
విలసిల్లు తుళజ భూవిభుకొమారకుఁడు
పొలుపొందు యేకోజి భూమిపాలకుఁడు
తనతండ్రి తుళజేంద్ర ధరణీశు పేర
పెనుపొందు మకరంద బిరుదాంశు పేర
శివకథా భరణ భూషితు వాని పేర
కవిచకోరారాశిరాకాచంద్రు పేర
చోళ సర్వం సహాసుత్రాము పేర
శ్రీలు రంజిలు శబ్దచిత్రార్థములను
రమణీయమైన యీ రామాయణమున
కమనీయముగ బాలకాండంబు జెప్పె
విదితుశజేంద్రుల నిలలోన నెపుడు
పొదలు సంపదలును పూర్ణ శక్తులను

సకల దీర్ఘాయుష్య సంతానములను
సకల రాజ్యంబులు సకల భోగములు
సమర జయంబులు సకల సత్కీర్తు
లమరంగ నొసఁగు మహారామ చరిత
యిదిమహాపుణ్యదమిది వేదసార
మిదిముక్తి సోపానమిది శుభోదర్క
పువ్వసుందర భక్తినెలమితో దీని
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను
భువిలోన వారికి పుత్రసంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసు రంజిల జేయుమానినీమణులు
వరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసగు
ధరణిలో నాచంద్రతారార్కముగను

★★
★★

# అయోధ్యా కాండము

శ్రీకర దశరథ క్షితి పురందరుడు
చేకొని రాజ్యంబు సేయుచు నుండి
మనమున రాజ చిహ్నముల నూహించి
తన జరా భారంబు తలపోసి జూచి
దరనసి ధారావ్రతంబు సామ్రాజ్య
కరణంబు కావున కాకుస్థకులుని
శరణాగత త్రాణ సద్ధర్మపరుని
కరుణా సముద్రుని కల్యాణ గుణుని
పరుల జేసిన మేల్మి పాలించువాని
గురుజన భక్తిచేకొమరొందు వాని
ధరన నాడినమాట తప్పని వాని
మునుల కుశల ప్రశ్నములు వేయు వాని
చాప విద్యాప్రౌఢి సవరించువాని
చూపరియగు వాని చుట్టాల సురటి
ధైర్య శౌర్యముల నౌదార్య గాంభీర్య
వీర్య సంపదలను విలసిల్లు వాని
జలద సన్నిభగాత్రు జగదేకమిత్రు
జలజాతహిత గోత్రు సుచారు చారిత్రు
సరసనన్నుతిపాత్రు సమరైక చైత్రు
నరవింద దళనేత్రుండైన నా పుత్రు
రామ సద్గుణధాము రమణీయ నాము
శ్రీమించ పట్టాభిషిక్తు గావించి

పరువడి జనముల పాలింప నతనీ
సురుచిర విభవంబు చూచెదననుచు
కొలువుండి దశరథ కువలయాధీశుఁ
డలరారు నలవసిష్ఠాది సంయముల
సకల బాంధవులను సకల మంత్రులను
సకల సామంతుల సకల భూప్రజల
పిలిపించి జలద గంభీర నాదమున
పలికె సభ్యులఁజూచి భావజ్ఞుఁడగుచు
చిరకాలమేను జేసితిని రాజ్యంబు
నిరుపమ నీతితోనే నేర్చినట్లు
పాలుచు మా పెద్దల పుణ్యయోగమున
కలవైరి రాజుల కరమర్థి గెలిచి
బ్రతికితి నేకాత పత్రంబు నీడ
నతిజరా కాంతుండనైతి కావునను
సతత మహోదారు సజ్జనాధారు
నతులిత గుణశీలు నర్కుని బోలు
రామచంద్రుని యింక రమ్య విధులను
కామిత మీడేరగా పట్టమిచ్చి
నిలజనుల నతఁడు నేలెడు గాక
నిమ్మెయి నామాట లెల్లవారలకు
సమ్మత యగునేని సంతసింతునన
కలకల స్వనము లేకంబుగా మొరయు
పలికిరి ప్రజలు భూపాలు వీక్షించి
చారు చామరసిత ఛత్రాన్వితమగు
శ్రీరమ్య పీఠపై శ్రీరాము జూడ

కోరియున్నారము కువలయాధీశ
కోరికల్ నేటికి కొనసాగె నిప్పు
డన విని దశరథుండాత్మ నుప్పొంగె
మనములో వాంఛమహితము గాగ
మధుమాసమున పుణ్యమహిత యోగమున
మధునిధననిభుకు మన్మధా కృతికి
సరసిజాప్తాన్వయ జలధి సోమునకు
పరగ వేవేగమె పట్టంబుగట్ట
పలెను కావలసిన వస్తువులెల్ల
వలనొప్పగా వెరవరుల నంపించి
తెప్పింపుడన విని ధీరవసిష్ఠుం
డప్పుడు రప్పింపుమనె రామచంద్రు
మనుజేశుడంత సుమంతునంపించి
తనయుని రప్పించి తగనిటులనియె
వినురామ శుభధామ విఖ్యాతినామ
మనువంశసోమ శ్రీమహిజాభిరామ
వాసి తప్పక నరువదివేల యేండ్లు
జేసితి రాజ్యంబు చెలఁగి నీతిగను
బలిసె నిప్పుడు జరాభారంబు నాకు
నలయక పాలింప నవశము రామ
గట్టిగా పుణ్య లగ్నంబున నీవు
పట్టాభిషిక్తుండవై ప్రజల పాలింపు
మన విని రఘురాముడనియె భూపతికి
పనువడి యీవేళ పట్టమేలయ్య
కనుల బెట్టుకొనుచు కాచుచునుండ

జనులనెల్లను నీవు చల్లగా భువిని
యనగ దశరథు డాయాసమంది సుతు
ననునయించుచు రాజ్యమంద నొప్పించ
నంతట రాగవుం డత్యంత భక్తి
సంతత యజ్వముల్ సజ్జనులబడి
పుణ్యాహ వాచకంబును దానములును
పుణ్యహోమంబు లుప్పొంగ గావించి
సరస వసిష్ఠాది సంయమీంద్రులకు
తిర మొప్ప పదివేల ధేనువులొసఁగె
సరసత ధనధాన్య చయముల నిచ్చి
వరుసతోడుత మ్రొక్కి వారుల ననుప
జని వసిష్ఠుండంతల సకల కార్యములు
జనపతి కెరిఁగించి సదనంబు కరిగె
సంతోషనిష్ఠుడై జనపాల చంద్రుఁ
డంతః పురంబున కరిగె నంతటను
ధరణిజతోఁగూడి దశరథ తనయుఁ
డురుతర భక్తితో నుపవాసముండి
టండిగా కుల దైవతముల పూజింపు
చుండు వేడ్క నయోధ్య నెల్లెడలనట్టి
పలువ పన్నీటిని చల్లించువారు
కలయ తోరణములు కట్టించువారు
పరుగుల మృగనాభి నలికించువారు
గురుమౌక్తికముల మ్రుగ్గులు దీర్చువారు
మురువైన కేతనమ్ముల నిల్పువారు
వరుగు చిత్తరువులు వ్రాయించువారు

విలసిల్లు దశరథు వినయ వివేక
ముల నెంచి తలయూచి ముదమందు వారు
ప్రమదంబుతో రాము పట్టాభిషిక్తు
సమయమును వీక్షింప చరియించువారు
నై మహోత్సవముల నలరియయోధ్య
శ్రీమహాలక్ష్మి సిరి నొంది నపుడు
కైకేయి కడ నూడిగములు గావించు
తాకోత్వయైన మందర సౌధమెక్కి
పొలుపొంద సాకేత పురమహోత్సవము
కలయకన్గొని దీని కరమొప్ప తేల్పు
నని రాము డాదిచె నా మహోత్సవము
వినిదాసి మందర విస్మయ మంది
నసూయ చిత్తయై సౌధంబులోనె
భాసుర శయ్యపై పవలించియున్న
కైకేయి కనుగొని కనలుచు బలికె
యే కార్యమెరుఁగక యిట పవళించి
సర్వ కార్యముల శయనింపజేసి
నిర్విచారంబుగా నిదురింప తగవె?
ధవుండు నవ్వులకైన తానాడు మాట
జవదాఁటఁడనుచు రచ్చల మెచ్చుకొందు
వదినేటితో కల్లలై చెనరుచుండ
యదిరి భూవిభుఁడగ్ర భార్యకు వెరచి
పట్టంబు శ్రీరామ భద్రుని కిపుడు
కట్టెదననుచు సంకల్పించినాడు
సేతు నా రాముడు చేకొన్నయపుడె

నీ ముద్దు కొడుకును నీవును నేను
నొరుల పంచలనుండి యొదిగిళ్ల పడుచు
తిరుగుటేగాని సుస్థితి గాంచగలమె
నీలెస్స నాలెస్స నీరజనేత్రి
నీలేమి నాలేమి నిక్కమూహింపు
మనవిని కైకేయి యాత్మ నుప్పొంగి
కినిసి మందరను కౌగిట నూరడించి
శ్రీరామ పట్టాభిషేకోత్సవంబు
వేరొండు గాకను విభిటనూత
పరగథాముఁడు తన ప్రాణపథంబు
భరతుని కన్నను భక్తుండు తనకు
బాలునీ కుటిలోక్తి చాలు మారాము
మేలు వార్తలు విని మెచ్చితినిదిగొ
కొమ్మ యీసొమ్ము గైకొమ్మని యొసఁగ
సొమ్ము చేకొనక నీసున పారవైచి
కోపంబు దీపింప కుబ్జక్రమ్మరను
కాపట్య మెఱుఁగని కైకతో ననియె
చెల్లబో రామాభిషేకంబు లెల్ల
యుల్లముల్లసిల్లగనుంచి భూషణములి
లిచ్చెదవును ముగ్ధలేమందు నిను
బావి కార్యంబు లేర్పడ జూచితీవు
ధరణికి రాముఁడు ధవుఁడాయనేని
భరతుని కెక్కడి ప్రాభవంబులును
నీ కుమారుండు రామనృపతికేపొద్దు
చేతులు కట్టుకొని సేవ సేయఁగవలయు

దనర కౌసల్యకు దాసివై నీవు
పనులు సేయగవలె పగలును రేలు
చెలువొంద పట్టాభిషిక్తుఁడై రాముం
డిలనేలెనేని వాహినులు మంత్రులును
దారలు సామంతులు దుర్గాధిపతులు
వరుస దంతి తురంగ భటులు శూరులును
వర్తింతురతనికి వశ్యులై రాజ
వర్తనం బిలనటువంటి దామీద
దశరథేశ్వరుఁడు స్వతంత్రుఁడుకాడు
పశుబుద్ధి మార్గము పాయమిందులకు
జెప్పెదకానకు శ్రీరాముతోను శీఘ్రాన
దప్పించి భరతుని రాజు గావించు
మనవిని కైకేయి యాత్మేశుఁడెంత
చనవరియైన సుజనునేయీరెండు
జెప్పంగ జెప్పిన సేయునేయతఁడు
తప్పుకార్యము దాన తగవైతె కాన
ననిన నిందుల కుపాయంబు చింతించి
తననేర్పుమెరసి మందర చెప్పదొనఁగె (౫)
నువిద దేవాసురయుద్ధంబునందు
ధవుఁడు నీయుపకృతి తలఁచినీకిపుడు
వరుస తోడుత రెండు వరము లిచ్చినది
మరచితోయా రెండు మనుజేసునడిగి
వరముల పదునాల్గు వర్షముల్ తిరుగ
పనువడి రాముని పంపుమొక్కటికి
ప్రేమతో భరతుని పిలిపించి వేగ

సీమకు రాజుగా సేయు మొక్కటికి
నీకీతిగావింపు మీక్షణంబునను
వేరొక్క కార్యంబు విభుఁడిఁచ్చెనేని
ధర్మపాశము చేత ధరణీశు గట్టి
నిర్మల చిత్తమైనీవు నీతనయుఁ
డసమాన భాగ్యంబు లతిశయిల్లంగ
వసుధ పాలింపుచు వర్ధిల్లుమనిన
మదినుంచి కైకేయి మందర కనియె
సుదినంబు నేడు నాసుకృతంబు లెల్ల
ఫలియించె చెలియ నీ ప్రాపున జేసి
తలఁచిన తలఁపెల్ల తలకూడెనేని
గూనుకు బంగారు గూఁడమరింతు
నూనపాదంబున నొదుగు రత్నాల
బిరుదు పెండారంబు బెడుదు నావద్ద
వరియింపు మనుచు భూషణముల నొసగి
వడిని కోపాగార వాటంబు జేరి
తడయక తొలగించి తనకు సొమ్ములను
చిలుకల కొల్కి మాసిన చీరగట్టి
తిలలేని నుదుట కస్తూరి పట్టుబెట్టి
కాననంబునకు రాఘవుని పంపించి
నానందనుని మహీనాధుని సేయు
నందాక విభునితో నలవిభాషింప
నందాక భుజియింపనని నిశ్చయించి
కలుషాత్మయగుచు కేకయ రాజపుత్రి
ఛలము చేకొని మహీస్థలినుండె నంత

శ్రీరాము పట్టాభిషేకోత్సవంబు
చేరి కైకేయితో బెట్టెదననుచు
నారేయి దశరథుండరుదెంచి హోమ
సౌర చిత్రతకేళి సదనంబునందు
మానుగా కైకేయి మహిపాల సుతను
గానక వెరగంది కడు చింతనొంది
వెలదిచే కైకేయి విధమెల్ల దెలిసి
కలతతో వచ్చి యా కనకాంగి జూచి
లెమ్ము యువతి లలామ లేఖ్య విలాసి
లెమ్ము నాపై ప్రేమ లేదటే బామ
యున్నాళ్ళవలె తన కెదురుగా వచ్చి
మున్నుగా నుపచారముల సేయువేమె
బెట్టుగా నీవు కోపించిన యపుడె
చిట్టాడ దొణగెనా జీవంబు లతివ
సరిగంచు కోకల సంఖ్యలుండగను
తరుణి మాసినచీర ధరియింపదగునే
వెలలేని సొమ్ములు వేలారులుండ
నెలత కోపెదపోణిమి పూననేల?
పొలతి నిన్నెవరైన పోనాడిరేని
తెలుపవే వారుల తెగదెంతునిపుడు
నీకు ప్రియంబైన నిరుపేదవైన
చేకొని ధనవంతు సేతు నీక్షణమె
నీకు కాకున్నచో నేవారినైన
చీకాకుజేసి శిక్షింతు చంద్రాస్య
మధిరాక్షి వినియు నీ మదిలోని కోర్కె

తిదియని వివరింపు మీ క్షణంబునను
నా జీవమైన త్రిగణంబు గానిత్తు
రాజీవముఖియన్న రాగిల్లి కైకేయి
కినుకమాని రసాల కిసలయగ్రాస
ఘన కషాయిత కంఠ కలకంఠి మాడ్కి
కలకంఠి మిగుల గద్గదకంఠియగుచు
పలికె మెల్లన మహీపాలు నీక్షించి
ఓయాత్మ నాయకయొగ్గి నా మాట
సేయుదునని బాస జేసితివేని
చెప్పెదనన్న యాక్షితపాలుఁడాత్మ
నుప్పొంగి తన కూర్మి యువిదకిట్లనియె
యెవ్వండు ధర్మాత్ముం డెవ్వండు వీరుం
డెవ్వండు నా ప్రియుండెవ్వఁడు నా జీవ
మట్టితనూభవుఁడగు రాముతోడు
గట్టిగా ప్రియమార గావింతుననిన
విని లేచి చేయెత్తి వెలఁది కైకేయి
దినకర చంద్రుల దిక్పాలకులను
సాక్షులు గావించి జనపాలుతోన
దాక్షిణ్య హీనయై దయమాలి పలికె
వరములు రెండు భూవరతొల్లి నాకు
కరుణించితివి నాకు కనుక నా వరము
లిరపొందనడిగెద నిచ్చెదననిన
భరతేశు నొకటికి పట్టంబు గట్టు
యెడలేక పదునాలుగేండ్లు శ్రీరాము
నడవుల చరియింపు ననువు యొక్కటికి

నని బల్కు నామాట శని చందమున
గానకాని నిజకర్ణ కూటంబు జొచ్చి
నొప్పింప మూర్ఛిల్లి నోరెండి నృపతి
తెప్పిల్లి కైకేయి దెసజూచి బలికె
పుట్టి సత్కులమందు పొలఁతి కైకేయి
యిట్టి పాపపుమాట లెట్టు పల్కెదవు
కన్నతల్లియగు యా కౌసల్య కన్న
నిన్ను పూజించును నీ సేవసేయు
నట్టి సద్గుణ శాలినట్టి పుణ్యాత్మ
నట్టి రాముని కానక నుపమందువది
యేటుల నేముందునే నెటుల సహింతు
కటకటా నీకింత కరుణ లేదటవే
కోపంబు నిర్దయ కుటిలతాసూయ
పాపంబు తెగువ కాపట్యంబుఁ బార్చి
చేకొద్ది తెచ్చి మచ్చిక చిన్ననాడు
నీకుగ్గు పోసెనో నీ తల్లి తాను
కాకున్న నిటువంటి కాని కృత్యంబు
చేకొందువటె దుష్ట చిత్తకైకవై
విడువక రఘురాము విపిన భూములను
విడయింతునను మాట విడువు మింతటను
ఘనుఁడైన రాముతో కౌసల్యతోన
నెనసి నీ సేవనే నెప్పుడ్దు సేతు
ననవిని కోపించి యా కైక బలికె
జగనాథ విను సత్య సంధుఁడవయ్య
మగువ మాటలనాడ మర్యాదె నీకు

జగమెరుంగగ దేవ సాక్షితో నుండి
జెప్పఁగూడని బాసజేసి వెంటాడు
తప్పద రటె యుందు ధరణిపాలకులు
అలక కపోతంబు కై దేగకిడదె
శిబిమేని మాంసంబు సిద్ధంబుగాను
సత్యంబుకై హరిశ్చంద్రుఁడు సతిని
ప్రత్యక్షముగనమ్మి వడయఁడే కీర్తి
మున్నలర్కుఁడు రాజముఖ్యుండు కడఁగి
జన్నియగట్టిలో చనయుగళమ్ము
సత్యంబుచేగల్గు సకల లోకములు
సత్యంబుచేగల్గు సకల సంపదలు
సత్యంబుచేగల్గు సకల సౌఖ్యములు
సత్యంబుచేగల్గు సంతాన వృద్ధి
సత్యంబెవ్రతమని సకల శాస్త్రములు
నిత్యంబు మొరలి నీ వేమి వినవే
అదిజెప్పనేల మీయర్కవంశజులు
సదయులు దారులు సత్య సంపన్ను
లై కీర్తి పుణ్యంబు లార్జింప లేదె
లోకంబు జూడనాలోచించి జూడు
మనవిని దశరథుండా కైక జూచి
ఘనశోక వహ్నిచే కనలుచు పలికె
దోసమెంచక నీవు దుర్నీతి బట్టి
గాసిజేసెద వేలె కైకేయి జగతి
నన్ను మహోన్నతుఁ జేచు తమ్ములను
నెన్నఁగ సామ్రాజ్యమేలుట తగదె

సదయుఁడు భరతుండు సత్యసంధుండు
ముదిత యీ పాపమున. కొడబడునే
కులకాంత కౌసల్య కొడుకును బాసి
యెలమిని ప్రాణంబు లెట్టుల ధరించు
నా ముద్దు కోడలు నళినాక్షి సీత
యేమని వగచునో యీమాటవిన్న
కాంత సుమిత్ర లక్ష్మణుఁడిట్టి సుద్ది
యెంత శోకింతురో యేమందు విధికి
సదయ నీమనసు నాయరవింద భవుఁడు
పదరక జేసెనో పాషాణమునను
కరఁగ దింతైన మార్గమునకురాదు
సరసీరుహారుణ చరణుండు రాముఁ
డరయకానన భూమినడుగెట్లు మోపు
పరగ మెత్తని పాన్పుపై పవళించు భోగి
నెలకొని తృణ శయ్య నిదురించు నెట్లు
వొలుచురా జాఁన్యంబు భుజియించువాడు
కందమూలము లెట్లు కణఁగి భుజించు
ముంతు దివ్యాంబరమ్ములు గట్టువాడు
కటినార చీరలు కట్టునేరీతి
భటులు భృత్యులు గొల్వవర తెంచువాఁడు
మృగములలో నెట్లు యెలఁగుచు తిరుగు
మగువ నామాటకు మారాడవలదు
నీ మహాభక్తుని నిర్మలాత్మకుని
రామచంద్రుని నీవు రక్షింపుమనుచు
పలుకులు పలుకంగ భావంబు కలఁగ

పొలుచు కన్నుల బాష్పపూరముల్ గ్రమ్మ
కడువడి నృపతి యాకైక పాదముల
పడిన గైకొనకను పాదముల్ తిగిచి
మరలి యాకోపంబు మదిని రెట్టింప
ధరణీశు జూచియాతరుణి యిట్లనియె
నీ సత్కులోన్నతి నీమహానీయశము
నీ సత్యవచనంబు నీటి పాల్జేసి
నింక నీ వరము లియ్యలేదనుచు
బొంకుము జీవముల్ పోఁగొట్టుకొనెదు
భరతుని పరిమార్చి పరమ సంతోష
భరితుఁడై శ్రీరామభద్రుని గూడి
కల్లలకునికియై కౌసల్య తోన
చల్లగా వర్ధిల్లు జనపాల యనిన
మాటకామీదట మాటతోఁచకను
నాటిన శోకార్తి నరనాథుఁడుండి
నంత మంగళ సుతూర్యములు ఘోషింప
సంతోషమున కృతస్నానుఁడై రాము
డుప్పొంగి సీతతో నొగిమేని కళల
నొప్పె రోహినితోటియుడు రాజనీతి
మరి యంతయభిషేక మంటపంబునను
సరసవసిష్ఠాది సంయముల్ వచ్చి
పుణ్య భూమినులను భానుకోత్తముల
పుణ్యాత్ములైనట్టి భూమిపాలకుల
సకల బాంధవులను సకల మంత్రులను
సకల కోవిదుల నచ్చటికి రప్పించి

ధవళ చామరములు ధవళాతపత్ర
మవిరళ చతురస్వము.గు శతాంగంబు
పటు శుభ్రవృషభంబు భద్ర సామాజము
ఘటిత శౌర్యముగల కంఠీరవంబు
వరఁగనౌ దుందుభరవ భద్ర పీఠంబు
కరవాలమనుపమ ఘన కార్ముకంబు
నెనమండుగురన్నలనేక ధేనువులు
ధనధాన్య రత్న సంతతులు పుష్పములు
మధులాజ గోక్షీర మహాసియదర్భ
దధిఘృత సకల తీర్థము లాదిగాఁగ
తెప్పించి యభిషేక దివ్యలగ్నంబు
తప్పక నిక్షించి తగ వసిష్ఠుండు
మనుజేసి బిల్వ సుమంతుని బనుప
జనియాతఁడా కైక సదనంబు జొచ్చి
వినయ భాషణముల విభుని మేల్కొలిపి
పనుపతి భక్తితో ప్రార్థించి పలికె
షొలిచె సభోమణి పూర్వశైలమున
లలితాభిషేకన లగ్నంబు దరిసె
వారు వీరనక నీ వసుధలోగల్గు
వారెల్ల శ్రీరాము పరమహోత్సవము
కోరిదేవరరాక కోరుచున్నారు
వీరమహారాజ విచ్చేయు మనవు
డామాట నారాచమై చెవినాట
సోమరియైరాజు శోకాబ్ధి మునిగి
అకట సుమంతనివాఁడు వాక్యముల

తుకతుక మర్మసంధుల విదారించ
ననవిభు దీనవాక్యము లాలకించి
తన కరములు మోడ్చి తగసుమంతుండు
వెరచి రెండడుగులు వెనుకకు తివియ
కరుణను నెడబాసి కైక యిట్లనియె
వినుము సుమంత భూమిభుఁడు రేయెల్ల
తనయాభిషేకనోత్సవ హర్షమునను
నిదురలేకిప్పుడు నిదురమబ్బునను
కదిసియున్నాఁడు వేగమె నీవుఁబోయి
లామాభి రాముని రాజనందనుని
రాముని తోడ్తెమ్ము రయమునననిన
చని సుమంతుఁడు రామచంద్రుని కథలు
వినుచు చక్కని రాజవీథుల సొగసు
లనువొంద కనుగొంచు నరుదెంచి యెదుట
కనకరత్న కవాటఘన తోరణాంక
సురుచిర ద్వార భాసుర వజ్రభిత్తి
సరస చందన ధూపసంఘ సుపుష్ప
చారు వితర్ది నా శరదభ్ర శుభ్ర
భూరిసౌధ ప్రజాద్భుత పూర్ణకుంభ
శారికాకలహంస సారసానేక
కీరమంజు కపోతకేకి సన్నాద
సాంద్రమై కైలాస సన్నిభంబగుచు
చంద్రభాస్కర బింబసమతేజ మగుచు
ధనవాస వనికేతన తుల్యమగుచు
కనకాద్రి శిఖర సంకాశమై వెలయు

శ్రీరామునగరు మచ్చిక మీరఁజొచ్చి
గారవంబున కొన్ని కక్ష్యాంతరములు
కడచి సుమంత్రుఁడు కడకతో నచట
పొడగని పెద్దలు భూషింపుచుండ
దౌవ్వారికులచేత తనరాక దెల్పి
యవ్విభు నాజ్ఞాచేనియతి ప్రవేశించి
చెలువైన పీఠిక శచీదేవితోన
విలసిల్లు గీర్వాణ విభుని చందమున
సీతా సమేతుఁడై చెఁన్నొందు రామ
భూతలాధీశ్వరు పొడగాంచి మ్రొక్కి
విను దశరథ భూమి విభుపాలమౌళి
నినుతోడి తెమ్మనే నీవు వేంచేయు
మనవుడు రఘురాముఁడపుడుత్సహించి
జనకజనందుంచి సౌమిత్రితోన
కరమర్థి రథమెక్కి కడకతో వెడల
వరుసతోడుత శుభవాద్యముల్ మ్రోయ
సందడింపుచు రాజసంఘముల్ గొలువ
వందిమాగధులు కైవారముల్ సేయ
చెలఁగి పుణ్యాంగనలు సేసలు జల్ల
నలరి ధాత్రీ సురులాశీర్వదించ
బలివిడి చతురంగ బలములతోన
నలువొంద కైకేయి నగరివాకిటికి
నరుదెంచి వేగ శతాంగంబుడిగ్గి
పరమానురాగ సంభరితుఁడై రాముఁ
డంతః పురంబున కరిగి యచ్చటను

చింతా నిమగ్నుఁడై క్షితినుండువాని
నతి జరాభరకంపితాంగుని దీను
ధృతిలేని దశరథాధీశుని జూచి
పరితపించుచు రామభద్రుండు తండ్రి
చరణ పద్మములకు సాష్టాంగమెరగి
యొడలెల్ల గంపింప నుల్లంబు కలగఁ
కడు భక్తితోన కైకకుమ్రొక్కి బలికె
ఓతల్లి కైకేయి యూర్వీశరుండు
నాతోన బలకఁడు నా తప్పులేమి
యీ కోప మీశోక మీదైన్యమితడు
చేకొన్న హేతువు శీఘ్రంబె దెలుపు
మనవిని నిర్లజ్జయైకైక బలికె
మీసరంబుగ రామ మీ తండ్రిమాట
జేసెదవేని నే జెప్పెదననిన
విని కైకతో రఘువీరుఁడిట్లనియె
తన తండ్రిమాటకై దారుణంబైన
కాలాగ్నినైనను కరుణతో జొత్తు
కాలకూటంబైన కబళీకరింతు
జనని యిందుకు నీకు సంశయంబేల
వినిపింపు నిజముగావింతునే ననిన
పయమాలి కైక యాతనితోన ననియె
ప్రియుఁడు మీతండ్రి సంప్రీతితో రెండు
వరముల దైత్యగీర్వాణ యుద్ధమున
వరుసతో నిచ్చె నా వరముల నిపుడు
భరతుని రాజ్యాధిపతి సేయు నొకటి

మఱి రాజ చిహ్నముల్ మానిని విడిచి
పదునాలుగేండ్లు తాపసవృత్తి బూని
వదలక చరియింప వాంఛించి యొకటి
యడుగగ ధాత్రీశుడవి నాకొసంగి
కడవడి నీకు యీ కార్యంబు దెలుప
నలుగుచున్నాడు పొమ్మనలేఁడు నృపుని
కలయసిద్ధ సంకల్పుని సేయ
దలచితివేని కాంతార భూములకు
తలరివల్కల జడధారివై వేగ
చరియింపుమన రామచంద్రుఁడుప్పొంగి
చిరునవ్వుతోనన సీమ పెంపొంద
వినయంబు శక్తి వివేక ధైర్యములు
ననువొంద తనయందు నావిర్భవింప
పలుకుల బెలుకుతోఁపక ముదమంది
పలికె కేకయ మహీపతి పుత్రిజూచి
తివిరి కానలకును దెలియనిప్పుడిట
వేవేగ తపసినై వెడలెదనిప్పు
డింత మాత్రమునకై యినకులేశ్వరుఁడు
చింతింపనేఁటికి శివ శివాయనుఁడు
కరుణాపయోనిధి రాఘవుని వీక్షించి
గరిమె నానందించి కైకేయి బలికె
రామ మా భరతుని రప్పించి వేగ
సీమకు రాజుగా జేసెద నిపుడె
పొమ్ము కానకు నీవు బోవునందాక
నిమ్మహీశుఁడు నేవగించుక పలుక

కదలక యన్నంబు భుజియింపం
యన్నంబుదన రాముండనియె తండ్రికిని
కట్టు మా భరతుని ఘడియపట్టంబు
గట్టిగా యిప్పటి కార్యసంగతులు
తల్లి కౌసల్యకు తగసుమిత్రకును
యిల్లాలు సీతకు నెలమితో దెలిపి
తపసిపోయెద దారుణాటవికి
కృపసేయు మందాక కేల్చికూర్చున్న
వలదని తండ్రికి వరుసతో మ్రొక్కి
కలుషాత్మయైన యాకైకకు నెరగి
చనుదెంచి లక్ష్మణ సహితుఁడై రాముం
డానరంగ నభిషిక్తయోగ్యవస్తువులు
కెరగి ప్రదక్షిణ క్రియజేసియంత
మరలి చామరముల మహితాతపత్ర
అతులసామజముల హయరథాదులను
ధృతిబూని వర్జించి దేవికౌసల్య
సదనంబునకు రామ చంద్రుండు వచ్చె
అదనుగా రాము పట్టాభిషేకంబు
పరులచే విఘ్నంబు పాటింపకుండ
తరుచుగా జపహోమదానాదికముల
గరిమెతో కూర్చుండి గావించుదాని
నెరచందురుని వోలు నెమ్మోముదాని
సముచిత వ్రతముల సవరించుదాని
కుముదాప్తకల తెరఁగున పోల్చుదాని
వెలిపట్టు ధరియించి విలసిల్లుదాని
కలయరాముని మేలుకాంక్షించుదాని

దేవికౌసల్యను దర్శించిరామ
దేవుండంత సద్భక్తి దీపింప మ్రొక్కె
మ్రొక్కిన శ్రీరాము ముదమొప్ప నెత్తి
గ్రక్కున కౌసల్య కౌఁగిట జేర్చి
ధాన్యమాయును పుత్రరత్నలాభంబు
పూజ్యత సత్కీర్తి పొందు శ్రీరామ
యనుచు దీవించి యోగాక్షతలను
తనయుని కొసఁగ నాతఁడు తల్లికనియె
నోయమ్మ తెలియలేదిక మహాభయము
పాయక పుట్టె నేర్పడ విన్నవింతు
వరములు రెండు భూవరచేత తొల్లి
కరమర్థవడసి కైక యా రాజపుత్రి
తనపుత్రు భరతుని ధరణీశుఁ జేయు
మనె నొక్కటికి తొమ్మిదైదేండ్లునేను
విపినవాసము సేయఁ వేడె నొక్కటికి
నృపతి యామాటకు నిట్టూర్పు విడిచి
తలఁకుచు నుండె నా తండ్రి వాక్యమ్ముల
నిలువక నొనరింప నేనీక్షణంబె
కదలెద జడలు వల్కలములు పూని
వెడలిపోయెద ఘోరవిపిన భూములకు
తపసికి తనకేల శయనీయ ప్రీతి
తపసికి నేల నుత్తమ రాజ్యచింత
యనవిన శ్రీరాము వాక్యములు వీనులకు
కసలు శూలంబులై గాటపడితి
కన్నీరు మున్నీట కాల్వలై పారుగ

ఖిన్నయై కౌసల్య గిటగిట వణకి
ధరణిపై మూర్ఛిల్లతాను లక్ష్మణుడు
కరముల నెత్తి యక్కమలాక్షినపుడు
పొదరింపు(చు) శైత్యోప చారముల
గారవంబున సేయ కడఁగి యామూర్ఛ
తెప్పిల్లి సౌమిత్రి తెరగొప్పవినగ
తప్పక దశరథాత్మజు జూచిబలికె
నాపుత్ర రత్నమా నా తండ్రిరామ
యీపాపమంతనేనెటుల సహింతు
గొడ్డురాలికిని యీ కువలయంబునను
బిడ్డలు లేదనె పెను దుఃఖమొకటి
నీవంటి సత్పుత్రునేగాంచి యుండ
భావింప శోకాగ్నిపాలౌట తగవె
పరఁగ నీతండ్రి చేపట్టిన మొదలు
కొరతలే కానిచ్చె కొననైతి సుఖము
భరతుని రాజ్యాధిపతి జేసినాడు
దొరిమెను కైకతో నుండుగా కిటను
సవతి మాటలకులో జని నిన్ను భూమి
ధవుఁడట్లు బొమ్మన తగునె కానలకు
నీవు చెంగటనుండ నీలి కైకేయి
కావరంబున నింతకడ గండ్లు జేసె
నా తండ్రి నీవు కాననకు నేగినపుడె
యే తంత్రమెత్తునో యెరుఁగ కైకేయి
పుడమి రాజుగ సేయ పూని నిన్నిప్ప
దడవి రాజ్యముసేయననిపె నృపుఁడు

కొడుకు రాజ్యంబు గైకొని యేలుచుండః
బెడ మాటలను విశ్రమింగుచునుండు
కైకేయి మొగమెట్లు కనుగొందు నేను
కైక నన్నెంచునే కలనైన గాని
పరదేశమెందరి పట్టణంబునను
తిరుగదునీవట్లు తిరుగు మీ పురని
నిరతంబు ముద్దు నెమ్మోము జూచి
మరచెద దుఃఖంబు మారామచంద్ర
నీ జన్మలగ్నంబు నీ శుభాంగములు
నీ జాతకము జూచి నిఖిల సంయములు
భూలోకమంతయు భుజబల స్ఫూర్తి
పాలించు నితఁడని పలికిరి గాని
కొరమాలి మునివృత్తి ఘోరాటవులను
తిరుగుదువని మున్నె తెలుపలేరైరి
యప్పుడే దెలిపితే యన్న శ్రీరామ
తెప్పున నేమైన తెగువ గైకొందు
నని దీన వాక్యంబులాడ కౌసల్య
విని సహింపక రెండు వీక్షణంబులను
ఘనమైన కోపాగ్ని కణములు బర్వ
కనుబొమల్ ముడిబడగంపింప మేను
సమముగా రామ కౌసల్యల జూచి
సమయోచితముగ లక్ష్మణుఁడిట్టులనియె
పౌరుషం బెడలించి బలముపోకార్చి
గౌరవం బడఁచి యాత్మ ోకుం వెరచి
తన భాగ్యసంపద దాయకునిచ్చి

వనమున పదునాల్గు వత్సరంబులును
పోయక శ్రీరామభద్రుండు తిరుగ
నాయమా తల్లియన్యాయంబు గాని
కైక కిచ్చినమాట కడవరాధనిన-
నీకిచ్చి తప్పుట నీతియె రామ
యీ మహిపాలకుండే సత్యవాది
కాముకుండధముండు కామినీజితుఁడు
నాదనార్తుఁడాతని మాట విన్నపుడె
వదలక పాపంబు వచ్చు వెంబడిని
కావున రాజ్యంబు గైకొని కడఁగ
నీవు పాలింపుము నీతితో ననఘ
కాదన్నవారల గదిమి బాణముల
వేధించి పరిమార్తు పేర్మితో ననిన
కౌసల్య చెలఁగి రాఘవున కిట్లనియె
నీ సహోదరుఁడాడు నీతి వాక్యములు
నా మనోహరములు నా పుత్రనీవు
నా మాట వినియట్లు నడచుకొమ్మనిన
చిరునవ్వు తళుకొత్త శ్రీరాముఁడనియె
మనుజేశు వాక్యంబు మనకిద్దరికిని
వినుట ధర్మముగాని వేరొండుగలదె ?
పసిబిడ్డగనక యీపగది లక్ష్మణుఁడు
విసువక పలికెను విశ్రమ స్ఫూర్తి
యని తల్లి నూరార్చియంత రాఘవుఁడు
తన ధర్మ మరయఁగ తమ్ముని కనియె
జననంబు మొదలుగా సాధించినట్టి

ఘన బాణ కార్ముక కౌశల స్ఫూర్తి
పగవారి పై జూపపాడియాగాని
తగునె చూపగనీకు తనవారిపైన
తనకును నీకును తండ్రి వాక్యంబు
వనువడి సేయుట పరమ ధర్మంబు
కావున నేఘోర కాంతారమునకు
వేవేగపొయ్యెద విఘ్నంబు సెయ
తలఁతువే నీవు నా తమ్ముఁడై యుండి
పలికితివిట్లు నాపై ప్రేమవలన
ననవిని లక్ష్మణుండా కోపముడిగి
వినయంబుతో రామ విభుచెంతనుండె
నంత కౌసల్య తానాత్మజు జూచి
చింతించి చింతించి శిరమూచి యూచి
నాకూర్మి నిలకడ నాతోడు నీడ
నాకుల రత్నమా నను గన్న తండ్రి
నిన్నిప్పుడెడబాసి నేనుండజాల
నన్ను తోడ్కొని పొమ్మ నా రామచంద్ర
యనిన కౌసల్యతో నా రాముఁడనియె
వినుమంబ నీవిట్లు విలపింపతగునె
పతియిష్ట దైవంబు పతియె జీవంబు
సతులకెల్లను శాస్త్రసమ్మతి మాట
పతిభక్తి కలిగిన భామకు మంచి
గతిగాని జగతిదుర్గతి నొందుబడయు
దటుగాన నీవు నీయాత్మేశు బాసి
యెటువలె వచ్చెద వేమందునిన్ను

ఓలిమితోని సంతాపించుభవుని
పాలించుటే నీకు పరమ పుణ్యంబు
సుతుని బాసినయట్టి శోకంబు వలన
పతిని పోనాడక భజియింపవమ్మ
భరతుండు నాకంటె భక్తుండు నిన్ను
నిరతంబు రక్షించు నీకేల వగవ
నను వీడు కొల్పుము నా మేలుకోరు
మని మ్రొక్క కౌసల్యయపుడు రాఘవుని
కనికరంబుననెత్తి కౌగిట జేర్చి
కానకగన్న చక్కని రామచంద్ర
కానకుబోయదె కటకట యిప్పు
డని విలపింపుచు నశ్రువుల్ రాల
గానకానిపైట కొంగున చక్కనొత్తి
పావనజలముల ప్రక్షాళ తాస్య
యై వచ్చి పుణ్యాహమమర సేయించి
దివిజులు వేదముల్ దిక్పాలకులును
రవిచంద్రులగ్నులు రత్నాకరములు
భూరుహంబులులతా పుష్ప కుంజములు
మేరు శైలాదులు మేదిని నభము
నీకు తోడుగవచ్చి నిన్ను రక్షింతు
రేకాలమని రక్షనెలమి చేగట్టి
దీవించి పొమన్న తివిరి రాఘవుడు
దేవికి మ్రొక్కి మోదించి యసుందుండి
తమ్మునితోగూడి తన నివాసమున
నెమ్మితో రాగ యెదురుగా వచ్చి

సీత నెచ్చెలులతో సేసలు జల్లి
సీతాంశు ముఖుఁడగు శ్రీరాము జూచి
రామాభిరామనే డటులుంటి వేమి
నీ మోము జూచితే నెరచందమామ
నందమైనది నిన్ను సామ్రాజ్య లక్ష్మి
పొంది పొందని దానిపోలికైయున్న
దానరనే సవతిగావున చిహ్నములను
తనకు తెలియఁగనీక దాఁచెనో చెపుమ
నురుచిరంబగు పుష్యశుభలగ్నమునను
గరిమె పట్టము నీకుగట్టెనా రాజు
యేది సితఛత్రమేది చామరము
లేది భద్రేభేంద్ర మేదితురంగ
మని పల్కు జనక రాజాత్మజ జూచి
తనలోన వెరగొంది దశరథాత్మజుఁడు
రా సీతముని కేల రాజ చిహ్నములు
యీ సుద్ది నీకిప్పు డెఱిఁగింతు వినుము
వరములు రెండు భూవరుఁడిచ్చె కైక
కరసి యా వరముల నడిగి కైకేయి
భరతుని రాజ్యాధిపతి సేయ నొకటి
కిరవొంద పదునాలుగేండ్లు నేవనిని
చరియింప నొక్కటి జననాథునడుగ
ధరణీశుడవియిచ్చె దారుణాటవికి
కదలితో తొడనన్న కలగియా సీత
హృదయేశు వదనాబ్జ మీక్షించి పలికె
నీవు బోవుటవని నిశ్చయంబైన

నీవెంట నేవత్తు నినుబాసియుండ
ననిపల్కఁ రఘురాముఁడవనిజ జూచి
వనజాక్షులేడ నీవనవాస మేడ
పాములు వనచర బహు మృగంబులును
గాములు పొడిరాళ్ల కంటకంబులును
తరుచు మార్గంబుల తరుణి కాల్కఁతగ
చరియింతువేలాగు సహియించి వెతల
సరసాన్నములు నివాసంబులు లేవు
సురుచిరంబైన వస్తువులేవిలేవు
యెలనాగ నీవెన్నడెంత కన్నెరుగ
వెలమితో వనవాసమిపుడిట్టు సేతు
వనవిని జనకజ యాత్మేశు జూచి
నీ తూరిమి నీతోడ కూడున్నతనకు
తోరంపు స్వర్గమైతోచు కొరదవి
చేరి నీసేవలు సేయు నాకెప్పు
డారణ్య దుఃఖంబు లతిసౌఖ్యదములు
చేపట్టియగ్నిసాక్షిగ నన్ను రాము
బపుడు విడుచుట యిదినీకు తగునే
వుండునే చంద్రిక వుడురాజుబాసి
యుండునే జీవంబు యొద్దిక బాసి
వత్తునీ వెంటనే వద్దంటివేని
హత్తినాకైన కార్యము జూచుకొరదు
సని కాళ్లపైబడి యడలుచూపుస్స్
జనకజనెత్తి నిచ్చల నూరడించి
మనసు శోకింప నీ మాటలాడితివి

మనసు నీ వెరుగవే మదిరాయతాక్షీ
పడతి నిన్నెడబాసి ప్రాణంబుతోన
నడవికి బోవ కాళ్ళాడునే తనకు
రమ్మని రాముఁడా రమణి రాకలకు
సమ్మతించిన జూచి సౌమిత్ర పలికె
నీవు పూనినపని నిశ్చయంబైన
నీ విల్లుమోచెటి నీ వెంటవత్తు
ననిన లక్ష్మణుజూచి యా రాముఁడనియె
నా కన్నతండ్రి లక్ష్మణ యిట్టలాడ
నీకు చెల్లునెతోడ నిన్నెడబాసి
మిడుకు చుండుదురు సుమిత్ర కౌసల్య
మిడుకార్చు వారెవ్వరోగినీవు తక్క
పాయక నిందుండు భక్తితో నీవు
యాయన్నతీక్షించి యనియె లక్ష్మణుఁడు
నీవెనా దైవంబు నీవెనా గురువు
నీవెనా తల్లిదండ్రి నీవెంట కొల్వ
వత్తు రావద్దన్న వగలచే పొగిలి
హత్తిన శోకాగ్ని నటకాగి క్రిమింగి
పమౌదునోయన్న యినకులేశ్వరుడు
సౌమిత్రిరాక కిచ్చగ సమ్మతించి
యప్పుడు రఘురాముఁడనఘ సుయజ్ఞు
రప్పించి ధనరత్నరాసుల నొసఁగి
మరియు శత్రుంజయ మనుభద్రకరిని
సరసాంబరముల భూషణముల నొసఁగి
తెరచి బొక్కసము భూదేవతలకును

తేనవి దీరగనిచ్చి తదనంతరంబు
ననుపమ దాన శీలాయత్తుడగుచు
నిర్ణయంబునె రామ నీలమేఘంబు
సర్ణ వర్షంబులు సర్వత్ర గురిసె
నాసుయజ్ఞానిరాణి కాయరుంధతికి
నాసీత తన భూషణాదులే నొసఁగ
నంత లక్ష్మణుండు నిజాప్తులకెల్ల
సంతసంబున తన సర్వస్వమిచ్చె
నావేళ త్రిగుణాఖ్యుఁడగు మహీసురుఁడు
గోవలె వేలెడి కులసతితోన
వచ్చియో రామ కేవల దరిద్రుఁడను
మచ్చిక ధనమిచ్చి మము బ్రోవు మనిన
నగి రాముడనె విప్రనాధనం బెల్ల
తగవెచ్చ బెట్టిన తరువాత నీవు
వచ్చితివిక ధేను వర్గంబులున్న
వచ్చుగా నీచేతి యష్టిపోవిసరు
యెందాక యదిపోవు నిత్తునందాక
సుందర గోవుల చూడుమనంగను
సరగున నాకోల సాచి విసరుచు
సరయువు పొంతకు సంతసమొప్ప
దీవించి రాముని దేనువుల్ గొంచు
వేవేగ ఇంటికి విప్రుండు జనియె
ఆ త్తరి రఘురాముడట మున్నువరుణ
దత్తాపి ఘనతనుత్రాణ కృపాణ
శరచాప ధారియై సౌమిత్రికొలువ

ధరణిజతోఁగూడి తనని కేతనము
వెడలి కాల్నడ రాజవీధిని రాగ
విడవక రాము నిరీక్షించి పౌరు
లారని శోకాగ్ని నడలి కైకేయి
దూరుచు దశరథుతోడరి తిట్టుచును
గేరుచు విధిని మిక్కిలి రాముమేలు
గోరుచు సీతను కొనియాడి వెతల
మీరుచు దయతోన మిడుకుచునుండి
యంతనా రఘురాముఁ దలరి కైకేయి
యంతఃపురంబున కరుగ నచ్చటను
మున్నూట యాఁబది ముగుదలు చేరి
తన్నుదూరుచునుండ ధైర్యంబు వదలి
గద్దియపైనుండి కైక మాటలకు
దద్దిల్లుచున్నయా దశరథుగాంచి
జానకి లక్ష్మణ సహితుఁడై మ్రొక్క
భూనాథుడా రాము పూనిక జూచి
ఖిన్నుఁడై రాము కౌగిట జేర్పలేచి
తన్నుతా తెలియక ధరణిపైబడిన
కని తండ్రినెత్తి రాఘవుఁడెద జేర్చి
చనువున సకల శైత్యోపచారముల్జేయ
తన మూర్ఛ తెప్పిల్లి తను జూచుచున్న
జనపతిగని రామచంద్రుఁడిట్లనియె
మీరు సర్వజ్ఞులు మిమ్ము బోధించు
వారెవ్వరికను భూవరశోకముడుగు
డరయమి సత్యంబుకైనను కాన

కరుగ లక్ష్మణ సీతలదరి నావెంట
పరగ వచ్చెదమని పయనమైనారు
కరుణింపుడనెడు రాఘవుజూచి నృపుడు
నారామ నన్ను కాసలకేగుమనుచు
నిరీతి నోరాడి యిత్తు వరమనుచు
ననుచు భూపాలుండాహాయని వగవ
వనితలు తముకూడ వగచిరాలోన
మిడుకుచు వచ్చి సుమిత్ర కౌసల్య
కడువడి విలపింప కని సుమంతుండు
శోకంబు నొరదియై సూటిగా తాను
కైకేయి జూచి దిక్కరించి పలికె
రాకకై నీ గుండె రాయిగావోలు
రాకుమారివిగావు రాక్షసివి నీవు
పతిహితమింతైన పరికింపలేవు
గతినీకు గలదె దుర్గతియింతె గాని
నీతల్లి పతిఘాతిని యనుచు వినమె
నీతల్లి కృత్యంబు నీకురాకున్నె
పట్టభద్రుని రామచంద్రుని కాన
కెట్టు పొమ్మనెడు నీకివి యెంతమేలు
విడువుము చలమున్న విని తలవంచి
విడిసి సిగ్గువ కైక విభుని కిట్లనియె
వసుధేశ సగరుండు వనజాప్తవంశుఁ
డసమంజానడవుల కనపడె తొల్లి
ఆ విధంబున రాము నడవులకిపుడు
నీవంప నిదియొక్క నేరమే నీకు

ననిన మాటకుమాట యధిపుఁడలేక
ననువుయపుడు సిద్ధారు డిట్లనియె
యేమని బలికితివిట్లు కైకేయి
యామత్తుఁడ సమంజుఁడతి బాలకులను
దురితాత్ముఁడని వాని దోలె కానలకు
శ్రీరాముఁడెగ్గేమి జేసెనారీతి
ఘోరాటవులకును కుటిలవై నీవు
నిత్యసద్గుణ యశోనిధి రాఘవుండు
సత్యాత్ముఁడన కైక సచివున కనియె
సత్యవాణీ సరస్వతి యనుమాట
ప్రత్యక్షమయ్యె నీవట్లు నాతోడు
సత్యసంధుఁడు రామచంద్రుండు కాఁగ
సత్యసంధునిగాఁగ జనకు గావించి
కడలేని కీర్తుల ఘన పుణ్యములను
వడుము మీకిటువంటి పలుకులేమిటికి
నాపుఁడు కైక విన్నాణంబు తెగుప
భూవల్లఁభుడు జూచి బుద్ధితో వగచి
మతిమంతుఁడైన సుమంతు కిట్లనియె
చతురంగ బలముల సకల బాంధవుల
హితుల మంత్రుల పురోహితుల పౌరులను
సతులను భృత్యుల సకల కోశముల
పిరు వారసక యీ పీటిలో నున్న
వారి రామునివెంట వడిపంపుమిపుడు
క్రూరురాలికైక కొడుకు తోడుతను

యూ ఛత్రరాజ్యంబునేలుగా కనీనే
నామాట లాలించి యలుక రెట్టింప
భూమీశు దూరి యప్పుడు కైకబలికె
మోమాటమింకేల మరియునీమాట
కే మోసవోదునే యినకులాధీశ
శ్రీరామ లక్ష్మణు క్షితి తనూభవలు
నార చీరలుగట్టి నా సమీపమున
కదిమిని సకల భోగమ్ములు మాని
యడవికి బోకున్న నది యెట్టియావి
నీ వర్షంబులనొల్ల నీమాట కల్ల
నీవాక్కు దాతవే నృపతినేజెల్ల
ననవిని దశరథుండల గంగజూచి
ఘనుఁడైన రాముడు కైక కిట్లనియె
తల్లి కైకేయి మా తండ్రి నీలాగు
యిల్లాలవై యుండియేల దూరెదవు
తప్పను కలనైన తండ్రి వాక్యంబు
తిప్పగె పోయెదనెలమి కానలకు
తివిరి వల్కలముల తెమ్మన కైక
కవిసి రామునికి వల్కలముల నొసఁగి
నా రామ లక్ష్మణు లందరు వగవ
నారచీరలు గట్టి నలువొంది రంత
శ్రీరామచంద్రుఁడు సీతచే రెండు
నారచీరలొసంగి నలినాక్షి గట్ట
నెరక నిట్టూర్పు నిగుడింప జూచి
మీరిన వగలచే మేదిని నాథు

ముగుదలాహాకారములు జేసిరపుడు
వగచి వసిష్ఠుని వనమయోధ్యయును
రాముండు లేనట్టి రాజ్యంబు వనము
సామికి కానిది సకల వ్యర్థంబు
పాలుపొంద భరతుఁడీ భూమి పాలింప
తలఁచువె శ్రీరాము తలఁచునుగాని
జనకజ వస్త్ర భూషణముల దాల్చి
చనుగాక యను సంతసనమున వైదేహి
దివ్య భూషణముల దివ్యాంబరముల
భవ్యంబుగా లక్ష్మి వగిది చెన్నొందె
నంత సీతా లక్ష్మణాన్వితుండగుచు
సంతసంబున రామచంద్రుండు భక్తి
తన తండ్రికిని మరి తల్లులందరికి
వినయంబుతో మ్రొక్కి వివరించిపలికె
వదలక పదునాల్గు వత్సరంబులను
పదునాల్గు ఘడియల వగిది వర్తించి
వత్తునే మీకింక వగవకుండనిన
చిత్తంబు కలఁగి యా క్షితినాథుడపుడు
మరలి వచ్చినదాక మరి పూర్తిగాగ
సరసాంబరాదుల జనకజ కొసఁగి
దీవించి పొమ్మన్న తివిరి కౌసల్య
దేవి సీతనుజూచి తెరగొప్ప పలికె
జనకుని తనయవై జగదేకవీరు
వనితవై యుండియు వనికేగవలసె
ధాత వ్రాసిన వ్రాత తప్పు దెవ్వరికి

బాతిమేనున నీడ బాయని రీతి
పాయక సద్భక్తి పతిద్రోవవమ్మ
వేయేల సతులకు విధుడె దైవంబు
పోయి రమ్మనుచును పొక్క సుమిత్ర
కాయ జాకృతిని లక్ష్మణుజూచి పలికె
తనయ శ్రీరాముని తండ్రిగా జూడు
జననిగా జూడుము జనకనందనను
వనమయోధ్యాపురివలెనో వీక్షింపు
మనచు దీవించి పొమ్మనవారు ముగురు
గురుమౌని బాంధవ కోటికి కెరగి
స్థిరభక్తితో ప్రదక్షిణముగా వచ్చి
తన తండ్రి వాక్యపద్ధతి రథంబెక్కి
జనకజ లక్ష్మణ సహితుఁడై రాముఁ
డల సుమంతునితోడ నరుదేర పౌరు
లెలమితోన వసుధ యీనిన కరణి
ముందర వెనుకను మొనసి పార్శ్వముల
సందడింపుచు వచ్చి సరిగొన్నవగను
కటకట కైక సంకల్ప మీడేరె
నటమీదనే మున్నదని పల్కువారు
దాసి యీ ముందర తప్పు కార్యంబు
జేసెగాయని మది చింతించువారు
తాలిమితోలి యీ దశరథాధిప
డాలికి లోనాయె ననితిట్టువారు
మొనసి కౌసల్య రాముని బాసియెంత
వగచునో యని చాల వగచెడువారు

శుభగాత్రి యీ సీత సౌధదియ్యె ప్రేమ
విభుభాయిలేదని వినుతిల్లచువాళ్ళు
పై రాఘు వెంబడి నడలుచు నడువ
భూరి శోకంబున ధాగలుచు మిగుల
నాలోన కౌసల్య యా సుమిత్రయును
కైలాగులోసంత కాంతలు గొలువ
తన యిల్లు వెడలియా దశరథేశ్వరుండు
కనుల బాష్పమ్ములు గ్రమ్ముచునుండ
కొంత దూరమువచ్చి కొడుకు గానకను
చింతించి చింతించి చివికి నోరెత్తి
హారామ! హారామ! హారామ యనుచు
సారెకు విలపింప సతులు శోకింప
రంత. సూర్యుడు—పశ్చిమాంబుధి గ్రుంకె
వింతదాసీకట్లు విపులమై గ్రమ్మె.
సురకాంతలాడెడి శోక వాక్యములు
పురజనంబులకు గుప్పున వినవచ్చె.
నానాడు పశు విహంగాదులు సైతె
మానిక జలముల నంచికయుండె
భూనాథుడప్పుడు పుత్రు నరదము
గానక కెంధూళి గాంచియాధూళి
గానక బయలును కనుగొని వారి
గానక బాష్ప సంగతిని శోకింప
నప్పుడు దశరథు కనె వసిష్ఠుండు
తప్పుడు దైవకృత్యము గాకేమేల
మరలు మటన్నను మనుజేశుడంత

మురలి తేజముగల మణిలేని పేటి
కరణినుండంతు నయోధ్య కనుగొని వగచి
పరితపించుచు తన బ్రతుకెట్టి బ్రతుకు
కైక మాటలువిని కడుమోసపోతి
కైకయిక్ష్వాకుల గౌరవంబణచె
ననుచు శోకింపుచు నందంద నిలిచి
చని చని కౌసల్య సదనంబు జొచ్చి
యీ రేయి శ్రీరాముఁడెక్కడ నుండు
నో తాము నాగుండె నొచ్చగాపోవ
దని తపించుచు నున్న యాత్మేశు జూచి
వనజాక్షి కౌసల్యవగచె వారులకు
గాసి దీరగ పూర్వకథలను దెలిపె
యీ సుమిత్రాదేవి యుడలార్పుచుండె
పరగ రాఘవుండంత పౌరులు గొల్వ
తరుచుఁదూరముబోయి తమసను జేరి
యను జన్మతోన సంధ్యాది కృత్యముల
నొనరించి పౌరుల నొగిఁజూచి బలికె
జనులార విడిచి మీ సంసారములను
చనుదేర యుచితమే చనుడయోధ్యకును
భరతుండు నాకంటె పరమ పుణ్యుండు
నిరతంబు మిముబ్రోచు నీతితోననిన
విని పౌరులారామ విభుజూచి పలికి
రనఘాత్మ నీవులేనా పురమెల్ల
భరతుఁడేలను మాకు భవనంబులేల
మరలదు నీమీది మమతలు మాకు

నీవెంట వత్తుము నీవు వద్దన్న
కావి వస్త్రంబుల గైకొందుమనిన
రాముండు నవ్వి యారాత్రి యుచ్చటను
భూమిజతో కూడ పొలుపైన పత్ర
శయ్యపై పవళించి జనులు మైమరచి
చయ్యన నిదురింప నగము రేపొద్దు
రథమెక్కి దశరథ రాజనందనుండు
రథమునయోధ్య మార్గమున దోలించె
మరలించి తమసను మరి వేగవతిని
సరయూనదిని దాటి చని మరునాడు
గంగానదిని జేరి కరములు మోడ్చి
హింగునీకాయను నెలమి వసించె
నంత వేగుట పౌరులందరు తమస
చెంతను మేల్కాని శ్రీరాము వెదకి
గానక రథచక్రగతుల చొప్పరసి
మానవేశ్వరు నాజ్ఞ మన రామచంద్రు
డరిగి నయోధ్యకునని నిశ్చయించి
పురజనుల్ సాకేతపురి కేగుదెంచి
యందు రాముని గానకందరు వగల
జెంది యాతని మేలు చింతింపుచుండి
రంత నక్కడ గుహుండరుదెంచి రాముం
సతితసంబున జూచి సాష్టాంగమెరగి
ఘనవస్తుచయముల కానుకలిచ్చి
వినయంబుతో రామ వేషంబు జూచి
వెరగంది రామ యీ విపిన భూములకు

నరుదెంచు కారణంబది దెల్పుమనిన
విని రాఘవుండు తన వృత్తాంతమెల్ల
వినుపింప గుహుండంత విలపింప జూచి
సహజన్ముతో రామచంద్రుండు దయను
గుహుని భక్తికి మెచ్చి గుహునాదరింప
నంత సూర్యుండు గ్రుంకె నాగంగనీట
నింతగా సంధ్యాది విధులెల్ల దీర్చి
గంగా జలముల నాకలిదీర్చి తమ్ము
శృంగి బేరాధిపుల్ సేవింపుచుండ
ధరణిజతో గూడ దశరథాత్మజుండు
పతుపడి తృణశయ్య పవళించియుండె
శరచాప ధారియై సౌమిత్రియంత
వరుస నీ పదునాల్గు వత్సరంబులును
విడిచి నిద్దురధామ విభుగాతు ననుతు
కడగి సంకల్పించి కడుభక్తితోన
కోరి దవ్వులనుండి కుటిలాత్మకైక
క్రూర కృత్యములను గుహునితో దెలుప
నరుణోదయంబయ్యెనంత రాఘవుండు
తిర మొప్ప నియమముల్ దీర్చి పిమ్మటను
దెప్పించి గుహునిచే తెలిమఱ్ఱిపాలు
గొప్పైన వెంట్రుకల్ కొదురొప్ప విప్పి
తాను తమ్ముడు జడల్ ధరియించి రాము
డానతుని సుమంతునను బొందబిల్చి
తాపసులము మాకు తగదు శతాంగ
మీవెరథముతోడనేగి యయోధ్య

ననువొంద తండ్రికి నడఘు తల్లులకు
ప్రణామంబు తెలుక్కాతిశుని దెల్పుమనిన
విని లక్ష్మణుఁడు కోపవివశుఁడై పలికె
మనసు నొచ్చిన మీద మాట లేమిటికి
కృపమాలి నీలి కైకేయి బోధనల
విపినంబునకు రాము వెడల దోలితిని
నీ ముద్దు కొడుకును నీవు నీయాలు
భూమి పాలింపుచు పూజ్యుఁడై యుండు
మని లక్ష్మణుఁడు జెప్పెననుము వృద్ధునకు
నన మానుషుని రాముఁడనియె సుమంతు
యీ సుమిత్రజుఁడిటు తెలమి పలికిన
యీ సుద్ది మా తండ్రి కెరింగింపవలదు
మిమ్ము కానలద్రోచి మిడుకుచునుంట పలికె
నీ శూన్యరథముతో నెటులనేబోదు
న్తో శుభాకార నేనుందు నీవద్ద
నన సుమంతుకు రాముఁడనియె నీవిపుడు
చనకున్న కైకేయి సందేహబడును
వేవేగ పొమ్మన్న విని సుమంతుండు
పావనుండగు రామభద్రుని కెరగి
సరగున రథమెక్కి చనె నయోధ్యకును
సరసహల్లక పద్మ సంఫుల్లకుముద
తుంగతరంగ సారస సద్విహంగ
గంగను కనిసీత కరము ప్రార్థింప
గుహుఁడు దెచ్చినయోడ కొమరుగా నెక్కి

సహోజన్మతోన భాగీరథిని దాటి
పరగ శ్రీరాముండా గుహుని వీడ్కొల్పి
వరసిజ నేత్రితో సాగి యంతటను
సరస సుదర్శన సరసినాడుండి
మరునాడు జనస్థానమహిత ప్రయాగ
కని భరద్వాజుని కరములు మోడ్చి
సర్వజ్ఞుఁడైన యా సంయమితోన
పూర్వోత్తరములెల్ల పొందుగా దెల్పి
యా రాత్రియందుండి యతనాజ్ఞవడసి
శ్రీరాముఁడరుదెంచి సిద్ధవటంబు
జేరెనా తరువున సీత ప్రార్థించె
నారాజ తనయులు యమునను దాటి
యా రేయి యందుండి యా మరునాడు
శ్రీరమ్యమైనట్టి చిత్రకూటాద్రి
కనుగొని యందున్న ఘనతపోధనుల
కనువొంద మ్రొక్కి వారాశీర్వదింప
నా మహామౌనుల యనుమతి వడసి
సౌమిత్రి నవపర్ణశాల కల్పించె
నందు రాముఁడు ముదంబతిశయిల్లంగ
సుందరీమణితోన సుఖముగ నుండె
అల రాముఁడొక్కనాఁ డవనిజతోడను
తలగడగా జేసి తగ సుఖియింప
క్రూరకాకము సీత కుచయుగాంతమ్ము
జీర నెత్తురుజింద శ్రీరాముఁ డలిగి
తృణముచే బూని మంత్రించి యాయగను

తృణము ఘోరాస్త్రమై తివిరి వెంటాడ
కాకి తిత్తిల్లి లోకములెల్ల జుట్టి
కాకుత్స్థకుల నీవెగతి యనిరాగ
కరుణించె రాముఁడు కాకి కన్నొకటి
శరముల కర్పించి చనియె నచ్చటను
శ్రమియించ సీతయిచ్చిన ఫలమ్ములను
రాముండు భుజియించి రంజిల్లుచుండె
సంత నా గుహునికి నా సుమంత్రుండు
వింతగా రాముని విధమెల్ల దెల్పి
పొగయించు సాకేతపురమొప్ప జొచ్చి
నగరు ప్రవేశించు నరనాథు కెరగి
కొడుకుల చందంబు కోడలి తెరగు
విడువక జెప్ప భూవిభుఁడు శోకించె
సంత కౌసల్య దుఃఖక్రాంత యగుచు
చింతించుచున్న యా క్షితిపతి జూచి
పలుమారు పోనాడు పార్థివుండెదను
కలఁగుచు తన పూర్వకథ చెప్పదొడఁగె
ఆట ప్రాయమునాడు హరిమధ్య నేను
వేటలాడగపోయి విపిన మధ్యమున
గురుపుత్రుం డొకఁడంధకుల తండ్రి
వరుసతో వందుంచి వారికై పోయి
జలము దెత్తునటంచు సరయువు కరిగి
జలములుముంప నాచప్పు డాలించి
యేనుగయను బుద్ధియేయనా శరము
మౌని పుత్రుని రొమ్ము మార్కొనినాట

హోమాత! మరితాతయని యరచె నత
డామాట విని భీతిని చేరి జేత
తెలిసి యతండు నాదెసజూచి పల్కె
తలిదండ్రులసిరి దప్పికై జలము
కొనిపొమ్ము వారి దోడ్కొనిరమ్ము పొమ్ము
మొనసిన బాణంబు మునుదీయు మనిన
చేతులాడక నేను చింతించి తివియ
నాతడి గురుపుత్రుఁ డరిగినద్దివికి
కడు నీతితోనంబు కలశంబుగొంచు
కొతుకములాకలమది కోరు నంధకుల
చేరి వృత్తాంతంబుజెప్ప వారిద్ద
రారని శోకాగ్నినడలి రంతటను
ముని ధంపతులును నిమ్మల పుత్రుకడకు
కొనిరాఁగవారలు కొడుకుపై వ్రాలి
విలపించివెన మూర్ఛజెంది.
తెలిసి కోపమున నాదెసమోమ్మెత్తి
జననాథ మావంటి సౌఖ్యంబు నీవు
కనుమని శపియించి కాంచిరి ముక్తి
నంతనా ముసరకు నపర సంస్కార
యెంతయు గావించియే నయోధ్యకును
వచ్చి దానంబులు వలనొప్ప జేసి
హెచ్చిన తమిరాజ్యమేలుచునుంటి
నా శాపము పిశాప మానస [illegible]
కాస రావములు కంపించె నేను
పావన శుభనామ పరిపంథిభీము

లావణ్య జతకామ లక్షణోద్దామ
నిందీవర శ్యాముని కోటిధామ
సుందరాకృతి రాము జూడలేనైతి
కొడుకుల నాకూర్మి కోడలినకట.
యెడబాసి నేటితో నేడు నాళ్లయ్యె
బలుబులే చెమటలు జనియించెమేను
నిలకడ జీవముల్ నిలవవింకనుచు
రామ నిర్జిత భృగురామ సీతాబ్ధి
థామశత్రువిరామ రామ రమ్మనుచు
కనుగొనరాని దుఃఖములన్ని మాని
జననాథుడంతట స్వస్థుడై యుండె
నంత సూర్యోదయంబయ్యె తూర్యంబు
లంతంత ఘోషింపనట నిద్రమాని
యంతః పురాంగన లందరులేచి
వింతగా దశరథు విధమెల్ల దెలిసి
పలువరింపుచు కైకపై మోదుకొనుచు
విలపింపగా వచ్చి విని వసిష్ఠుండు
సకల బాంధవులను సచివులు హితులు
సకల సేనానులు చనుదెంచి వేగ
ధరణీశు జూచి సంతాపించుచుండ
సరస వసిష్ఠుండు సచివుల కనియె
సురుడు వసిష్ఠుండు కొమరొప్పబలికె
సొరికు శోకింప సమయమే మనకు
పైరాచ కార్యంబు భావింపవలయు

రాజులేకున్న రాష్ట్రము పెంపుకనదు
రాజులేనట్టి యారాత్రి చందమున
కావున తైలపక్వము నృపుమేను
గావించి భరతుని కడగి తెండనిన
వినిమంత్రులధిపు నవ్విధము గావించి
చనిగిరి వ్రజమున స్వప్నంబు గాంచి
పరితపింపుచు నున్న భరతుని జూచి
కరములు మోడ్చియో కాకుస్థతిలక
గురువసిష్ఠుఁడు గ్రక్కున మిమ్మునిపుడు
వెరవొప్ప దెమ్మని విచ్చేయు డనుడు
కనిదూత చిహ్నముల్ కలగి సంశయము
మనమున పెనగొనమామ కాతెరగు
దనరంగ దెల్పి యాతడు పంపవేగ
చనవున శతృఘ్న సహితుఁడై భరతు
డరధంబుపై నెక్కి యా ప్రొద్దెకదలి
ధరశూన్యమగు సయోధ్యాపురి జూచి
కలగుచు జొచ్చి యా కైకేయినగరు
నెలమితోడుత రాగనెదురుగా వచ్చి
కైక కౌగిటజేర్చ కైకకు మ్రొక్కి
కైక నడచిన కథలెల్ల దెలసి
తక్కక భరతుడా తల్లినిజూచి
యక్కట యెంత సాహసము జేసితివి
పాపాత్మురాలవు ప్రాజ్ఞవా నీవు
నీ పొట్టనే పుట్టి నిందితుడనైతి
నోరదియ్యె నీమోము చూడరాదనుచు

కరమర్థిపోయి యా కౌసల్య కెరగి
విలపింప కౌసల్య భరతుని జూచి
వలగొని యుండేల వచ్చితివన్న
నీకేల శోకింప నీకేల చింత
నీ కోర్కెలెల్లను నీ తల్లిచేత
పలియించెనని విని భరతుడు క్రుంగి
తల్లికి దవ్వుల నిల్చితగనిట్టులనియె
ప్రకటించి నిజముగా పల్కెద తల్లి
త్రికరణ శుద్ధిగా తెలియ నీ కార్య
మని ప్రచ్చరించ రానట్టి యొట్టులను
కనికరంబున నిడకౌసల్య బెదరి
యేల పోనాడితి నిట్టి సద్గుణుని
నేలపోనాడితి నీ పుణ్యుననుచు
భరత శత్రుఘ్నులపై వ్రాలి యడల
సౌరదియందరు చూచి శోకించిరపుడు
గురువసిష్ఠుండు గ్రక్కున శోకమార్చి
భరత శత్రుఘ్నుల భావించి పలికె
మీవంటి కొడుకులు మేదిని కలుగ
భూవరుండమరేంద్ర భోగంబు జెందె
సుచరిత్రులార యీ శోకంబుమాని
యుచిత కృత్యంబుల నొనరింపుమనవు
ఆచారవంతులై యారాజ తనయు
లాచరించిరి తండ్రికఖిల కృత్యములు
శోకనంతట రాజసుతులు శుభంబు
చేకొని జూచి వసిష్ఠుఁడిట్లనియె

భరతకానకు రామభద్రుండు జనియె
నరిగెనా దశరథుం డమరేంద్రపురికి
రాజ్య మెక్కింతన రాజకరమైన
పూజ్యాలందుందరు పౌలము ధర్మంబు
తప్ప వర్ణాశ్రమ ధర్మంబులిలను
తప్పక నామాట ధరణి పాలింపు
మనవిని భరతుండువ్రగుడై పలికె
మునినాథ నేనేమి మూఢచిత్తుడనె
మనమున నెరుగవే మాకులక్రమము
ననఘ నిందితుఁడైతి నందరలోన
నా తల్లి రాము కానకునంపి పొదవ
మా తండ్రి దశరథ మహిపాలు ననిచె
యిటువంటి భాగ్యంబు నే పొందియుండి
కటకటా రాజ్యంబు కాంక్షింపవలెనె
కరమర్థిపోయి రాఘవుని ప్రార్థించి
పరువడితో దెచ్చి పట్టంబు కడుదు
నని మంత్రులను జూచి యఖిల యోధులకు
పనువడి తెలుపుడీ పయనమనంగ
విని మంత్రులట్లుగావించి రంతటను
మనువంశ తిలకుండు మరునాడు లేచి
పౌరలు సామంతులు దుర్గాధిపతులు
పరమ బాంధవులును భటులు మంత్రులును
చతురంగ బలముల సన్నిధి గొలువ
కుతుకంబుతో పౌర కోటులే తేర
నల వసిష్ఠాది సంయము లేగుదేర

పలుమారు పొగడుచు పౌరులు నడువ
తుములంబుగాగ దుందుభులు ఘోషింప
నమరులానందించి యా వేడ్కజూడ
తల్లులంపరు గూడి తన వెన్కరాగ
పల్లకులును రాగ భరత శత్రుఘ్ను
లరుణరత్న ప్రభవంబగు రథంబెక్కి
కరమర్థితో వచ్చి గంగనుగాంచి
విదితంబుగా దండు విడియుంచిరందు
నిది వినివచ్చి నీకేమి పనియిచట
నంత చారులు భరతుండు నవ్వి పలికె
యాననమున దరహాస మొలుకంగ
సరయువు నది శుభస్నానముల్ జేసి
భరతుడు జేసెను పరమ పుణ్యాత్మ
మాయన్న రాముని మహికి రాజుగను
సేవతోయెదనన్న చెలగి యా గుహుడు
సాయమై నిలిచెద సత్యంబు యనుచు
భరతుని కొనియాడి ప్రణతులొనర్చి
కరమర్థి గుహుడంత కానుకలిచ్చి
భరతునికా రాఘవుఁడు మున్ను
చిరుత కెంజటలు దాల్చిన తావుజూడ
భరతుఁడుత్కట శోకభరితుడై జూచి
పరమ పుణ్యుఁడు మఱ్ఱిపాలు తెప్పించి
జనము లంపదును విస్మయమునంది జూడ
తన తమ్ముఁడును దాను ధరియించె జటల
నతని భక్తికి మెచ్చి యా గుహుండప్పు

డతీ తయంబున యోడతానె దెప్పించి
తతయక వారల దాటించె నదినీ
కడువడ గుహునితో కడలి రాఘవుడు
కని భరద్వాజుల ఘనతపోవనము
తన సైన్యములనెల్ల దవ్వులనునిచి
చనివెంట భరతుఁడా సంయమిపాద
వనజంబులకును శేవల భక్తిమ్రొక్క
మౌని కోపమున పలుమారు నా భరతు
పోనాడ భరతుఁడు పొగలి భీతిల్లె
యో! మునిచంద్ర మహోన్నతురాము
సీమకు రాజుగా సేయనే చనెద
నన భరద్వాజులు హర్షంబు జెంది
పనువడి దీవించి భరత ముందుగను
నీ వారితోగూడ నీ బలంబులతో
వేవేగ భుజియించి విచ్చేయుమనిన
భరతుండు చతురంగ బలములతోన
పరువడి భుజియించి ప్రార్థించి మ్రొక్కి
యతనాజ్ఞ చిత్రకూటాద్రికి జనగ
చతురంగ బలపాద జాత పాంసువులు
గగన భూభాగంబు గప్పిన జూచి
దిగులొంది మృగములు దిశలవాపోవ
కని రాముఁడపుడు లక్ష్మణున కిట్లనియె
వినవచ్చె సౌమిత్రి వీరఘోషంబు
లరసి రమ్మనవోయి యంతట గొప్ప
తరువెక్కి నిక్కియుత్తర భాగమునను

పరతెంచుచున్న యా భానువంశజుల
బిరుదులు గని రోషభీషణుండగుచు
భరతుండు రాముపై పరతెంచునను చు
నురికి యా వృక్షంబు నొయ్యన వచ్చి
శ్రీరామ భరతుండు సేనలగూడి
వారక నీమీద వచ్చుచున్నాడు
నీ వోరుపికచాలు సేనాని ద్రుంతు
నీవాజ్ఞ యిమ్మన్న నీతి భావించి
సౌమిత్రితో రామచంద్రు డిట్లనియె
నా ముద్దుతమ్ముడై నాయంబు మాని
పలుకుదురా చాలు పసిబిడ్డ బుద్ధి
కలుష వదూరుఁడు పుణ్యకలిత మానసుడు
పరమ పావనుఁడు శోభన చరిత్రుండు
భరతుండు సుగుణుండు భ్రాతృవత్సలుఁడు
పమ్మిచూడగ మన భరతుని వంటి
తమ్ముడీ జగతిని తనకు దుర్లభుండు
భావించి నీతని భక్తితో తనకు
వావిరి రాజ్యమీ వచ్చుచున్నాడు
మిడవు సంశయబుద్ధి విడువు నీవనిన
జడిసి యూరకెయుండె సౌమిత్రియపుడు
భరతుఁడు సరగున పరతెంచి రథము
గిత్రకేవ దిగి సేన గీపొంన నిల్పి
తొడరి తల్లుల వెన్కతోడ రమ్మనుచు
ఒదంగి పసిష్ఠుని ఎట్టిడకేసి
గుహాలక్ష్మణానుజ గుణశాలి సూత

సహితుడై వచ్చి యాశైలంబు నెక్కి
యంతంత నిల్చుచు నచ్చట కల్గు
వింతలాశ్రయములు వీక్షించుకొనుచు
చని చని నవ పర్ణశాలలో నున్న
జననుతుండగు రామచంద్రుని జూచి
కంటివే శత్రుఘ్న కాలకౌటిల్య
మొంటిగా శ్రీరాముడున్నాడు వనిని
యీ వనవాసంబు నీ తృణశయ్య
నీ వల్కలంబులు నీ జటాభరము
కలిగె రామునికి నీ కైకేయివల్ల
కలిగె గానకిట్టి కడగండ్లు జూడ
ననుచు శత్రుఘ్నుతో నడలుచు వచ్చి
కని రాముపాద పంకజముల కెరగి
రమ్మని రాముండు రయమున నెత్తె
తమ్ముల నిర్దరిని తగ కౌగిలించి
దీవించె వారువైదేహికి మ్రొక్కి
రావేళ నా గుహుండా సుమంతుండు
వరగ రామునికిని ప్రణమిల్లి వారు
మురువైన కుశ పీఠముల వసియింప
కరుణా సముద్రుండు కాకుస్థకులుఁడు
పరమ పావనుఁడైన భరతుని జూచి
కుశలమె తండ్రికి కూర్మి తల్లులకు
కుశలమె చెప్పుమా కువలయేశ విడిచి
విడిచి నీ భూమిని విడచి ప్రజలను
విడిచి రానీతియె వీరులందరను

నా తండ్రి దశరథ నరనాథు నాజ్ఞ
నీతితో రాజ్యంబు నీవు సేయుదువె
తల్లిదండ్రుల నీవు దయతోడ నెప్పు
డుల్లంబు రంజిల్ల నూరడింపుదువె
చెలువు మీరగను వసిష్ఠునే పొద్దు
పొలుచు సద్భక్తితో పూజ సేయుదువె
తలకొన్న నియతి నత్యంత భక్తిగను
నలరంగ సేతువే యగ్నిహోత్రముల
మహనీయ మతులైన మంత్రుల తెలిసి
విహిత మంత్రంబుల విధమెరుంగుదువె
కొను నిద్రమాని వేకువ జాములందు
ననువొంద సేతువే యర్థచింతనము
యే పనులకు యోగ్యులెవ్వరో జూచి
యా పనులిత్తువే యరసి వారలకు
దండిగా నీతితో తప్పుల నరసి
దండింతువే నీవు తనవారినైన
మతిమంతు బలమంతు మహి శౌర్యవంతు
పతిహితు సేనాధిపతి జేసినావే
కొలిచినవారులా కొనకుండ దయను
నెలనెల జీతముల్ నీ వొసంగుదువె
చారులచే సమాచారంబులను వి
చారింతువే నీవు జాగ్రత నెపుడు
జాలివొందెడి పేద సాదల మొరల
నాలించి వారల నాదరించుదువె
పుడమి వర్ణాశ్రమమ్ముల ధర్మములను

విడవక నడిపింతువే తప్పకుండ
చోరుల జారుల శోధించివారు
జాడసీయకగాసి శిక్షింతువేనీవు
కరితురంగాదుల కలధేనువులను
నరసి రక్షింతువే యను దినంబునను
గట్టిగా వస్తు వర్గముల ధాన్యముల
గట్టింతువే సైన్యకలిత దుర్గముల
వేమారు నీతితో విత్తముల్ గొనక
శ్రీమించి బ్రోతువె సీమ కాడవుల
మరిదేవ భూదేవ మాన్యంబులన్ని
కరమర్థి బ్రోతువే కామితముగను
వేరొక్క మతమెంచి విత్తలోభమున
కూటమి వినవుగా కొండెముల్ చెవుల
చతురుపాయంబులు షడ్గుణ స్ఫూర్తి
నతులశక్తి త్రయమాత్మ నూహించి
చూతునాయన్నను స్రుక్రియా భరతు
డాతరి భీతుఁడై యన్నను జూచి
యెరుగ నీ ధర్మంబు లేమియు రామ
విరస కార్యముబట్టి వినుపింతు ననుచు
దశరధు చందంబు దడయక దెలుప
దశరధాత్మజాడును ధరణీతనూజ
సౌమిత్రియును శోకసంతప్తులగుచు
తామసించకను పంచాని కరిగి
యచట కృతస్నానులై ఘత్రిశంద్రి
కుచిత కృత్యంబుల గావించిమునుపడి

వేరగున తమ పర్ణశాలకు వచ్చి
పరువడి నున్నచో పరమ బాంధవుల
కడగి కౌసల్యాది కామినీముఖుల
తొడరి వసిష్ఠుండు తోడ్కొని వచ్చె
జనకజ లక్ష్మణ సహితుఁడై రాముఁ
డనువొంద తల్లుల యడుగుల కెరగి
విలపింప వారలు విలపించిరంత
వలదని శోకంబు వారించె గురువు
శ్రీరాముఁడపుడు వసిష్ఠుకు మ్రొక్కి
వారల కుశపీఠ వాసులజేసి
భరతు వేషము జూచి పలికె రాఘవుఁడు
పురిగొన్న జెడలేల పూనిత వీవు
భరత భూపతి వాక్య పద్ధతి వెలగి
నిరుపమ రాజ్యంబు నీవేలు మనిన
భరతుఁడిప్పుడు రామ భద్రుని జూచి
యిరువొంద రామనీ విట్లాడ తగవే
యురగాధిపతిబూను నుర్వీ భరంబు
ధరియింపనేర్చునే తగనీరు వట్టు
ధరణిపాలన మేడతా కేడ రామ
నిరుపమ శక్తితో నీవేలవలయు
ననిరామచంద్రు పాదాంబుజములను
ఘనభక్తితో వ్రాలి కదలకయున్న
తమ్ముని కౌగిట తగనూరడించి
సమ్మతితో ధర్మసరణి బోధించి
తన తండ్రి వాక్యంబు తప్పక నేను

వనముల చరియించి వత్తుని వేగి
జనకాజ్ఞ తప్పక సకల సామ్రాజ్య
మనువొంద గావింపుమన భరతుండు
చేరి శోకింప వసిష్ఠుఁడిట్లనియె
వోరామ: భరతేశు నూరకసనువ
నాయమే? యితనికి సమ్మికగాగ
పాయక నెమ్మి నీపాదుకలనిన
కరుణించి రాముండు కనకపాదుకలు
భరతుని కొసగిన భరతుఁడుప్పొంగి
శిరమున నిడుకొని శ్రీరాముజూచి
యిరవొంద పదునాలుగేండ్ల మీదటను
తరలక ఘడియేని తడసితివేని
సొరది చిచ్చునకును చొత్తునేననుచు
గావించి బాస చక్కగ రామచంద్రు
కావేళ మొక్కి యానతని వన్నునను
తనవారితోగూడె తమ్ముడుతాను
గొనకొని రాముని గుణము లెన్నుచును
పాదుకాయుగళంబు భద్రసామజము
మీదనుంచుకొని నెమ్మినీ భక్తితోన
వచ్చి భరద్వాజ వరమునీంద్రునికి
మచ్చికతో మ్రొక్కి మౌనిపంపగను
తరలియయోధ్యలో తల్లులనునిచి
గరిమెతో నాప్తుల కావలిబెట్టి
మొనసి నందిగ్రామమున కేగుదెంచి
యనుపమంబైన సింహాసనంబునకు

పాదుకాయుగళంబు భక్తితో నునిచి
సాదరంబునను రాజ్యము సేయుచుండె
నిదియయోధ్యకాండమెల్ల లోకముల
విదితమౌ బుధలోక వినుతమౌగాత
అనిభోసలాన్వి సుధాంశుడుత్తముఁడు
ధననాథ తుల్యుండుదార విక్రముండు
సరస సాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుండు కవి కల్పకంబు
విలసిల్లు తుళజ భూవిభుకుమారకుడు
పొలుపొందుయేకోజి భూమి పాలకుఁడు
తనతండ్రి తుళజేంద్ర ధరణీశుపేర
పెనుపొందు మకరంద బిరుదాంకుపేర
శ్రీలు రంజిలు శబ్ద చిత్రార్థములను
రమణీయమైన యీ రామాయణమున
నమరంగ నీ యయోధ్యాకాండ జెప్పి
యుదితుళజేంద్రుల కిడునెప్పుడిలను
పొదలు సంపదలును పూర్ణశక్తులను
సకల దీర్ఘాయుష్య సంతానములను
సకల రాజ్యంబుల సకల భోగముల
సమర జయంబులు సకల సత్కీర్తు
లమరంగ నొసంగు మహారామ చరిత
మిది మహాపుణ్యదమిది వేదసార
మిది ముక్తి నెలమితో దీని
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవ్వరు వ్రాయించినా నెవ్వరు వ్రాసినను

భువిలోన వారికి పుత్రసంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసు రంజిలసేయు మానినీ మణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసయు
ధరణిలో నాచంద్రతారార్కముగను

"శ్రీరామార్పణమ్"

# అరణ్య కాండము

శ్రీరమణీయమౌ చిత్రకూటమున
కూరిమి వసియింప కొన్ని వాసరము
లంత రాఘవుఁడు భరతాగమనంబు
చింతించి యిచట వసింపరాదనుచు
మౌనులకును మ్రొక్కి మౌని సమ్మతిని
జానకీ లక్ష్మణ సహితుఁడై వెడలి
యత్రియాశ్రమమున కలిగియమ్మునికి
గాత్రంబు పులకింప కడుభక్తి మ్రొక్కి
యతని దీవెన గాంచిరంతటను
కుతుకంబుతో సీతకును ననసూయ
వీడని సొమ్ముల వివిధాంబరముల
వాడని విరుల నవ్వారిగా నిచ్చి
తనపెండ్లి కథలెల్ల ధరణిజ జెప్ప
విని సంతసించి దీవించె నాలోన
యినుఁడు గ్రుంకిన జూచి యినకులేశ్వరుఁడు
దనర సాంధ్యాది కృత్యములను దీర్చి
యారాత్రి యందుండి యామరునాడు
కూరిమి యత్రి వీడ్కొని రామవిభుఁడు
తాల తమాల హింతాల తక్కోల
సాల రసాల మాసరతరు ప్రకర
గండ భేరుండ భేకర మృగోద్దండ

దండకారణ్యంబు దగ ప్రవేశించి
నానా మృగమ్ముల నానా శ్రమముల
నానా ద్రుమంబుల నలువొంద జూచి
వరుసతో మెచ్చుచు వచ్చుచో నెదుట
దురిత చిత్తుండు సురద్రోహి కంటకుండు
కుటిల విరాధుండు ఘోరాయని యాశ్చ-
కుటిల కుంతల సీత గొనిపోవజూచి
రాముండు కోపించి రాక్షసాధముని
భీమాస్త్ర తతులచే పేర్చి వధంప
నంత గంధర్వుండై యా రాక్షసుండు
సంతసంబున రామచంద్రు దీవించి
చనియె రాఘవుడంత శరభంగమౌని
కనుగొని మ్రొక్కి సత్కృతముల బడసి
మునిచేత దివ్యాస్త్రముల సంగ్రహించి
యనువొందయా సుతీక్ష్ణాశ్రమంబునకు
జనిమహామౌనికి సద్భక్తి మ్రొక్కి
యనఘుండమ్మౌనులకు నభయంబులిచ్చి
వలనొప్ప దైత్యుల వధియింతు ననుచు
పలికిన విని సీత ప్రాణేశుజూచి
మునివృత్తి బూని నిమ్ముల సంచరించు
మునకేల దైత్యుల మర్దించు చిత్త
నావుడు రాముండు సతినాకి తెలియు
నీవు ముగ్ధవుగాన నీరజనేత్రి
తలపవు క్షత్రియ ధర్మమింతైన
కలనైనగాని సంకల్పంబు ప్రతిన

మీరుచు తరువుల మెలగునీడలను
గ్రాలుచు సంఫుల్ల వనజాకరముల
దేలుచు నిటుల వర్తించి పదేండ్లు
తరలి యావలన యగస్త్యభ్రాతగాంచి
కరములుమోడ్చి యగస్త్యప్రభావ
మతనిచే విని రాముఁడారాత్రి గడపి
యతని వీడ్కొని యగస్త్యు చొప్పునకు
జనిజపస్వాధ్యాయె సద్ధర్మ పరుని
వసధులాపోసించి వర్తించువాని
కనుపమ వింధ్యాద్రి నణచిన వాని
ఘనుడైన ధూర్జటి గతినొప్పువాని
వారుణాకృతుల వాతాపియిల్వలుల
బోరున శపియించి పొరిగొన్నవాని
అంభోజ సంభవాద్యమర సన్నుతుని
కుంభ సంభవుగాంచి కొమరొప్ప మ్రొక్కి
పూజింప నమ్మౌని పుణ్యాత్ము రాము
పూజించి కార్యంబు బుద్ధినూహించి
శర శరాసనఖడ్గ సకల దివ్యాస్త్ర
శరధుల నీయ దాశరథి చేకొని
విభుత సౌధీశుని వీడ్కొని పోవగను
ప్రభాతముగ తరలి గోదావరి తీరమున
పంచవక్త్రి ధ్యాన పరసంయమీంద్ర
సంచయ పాదపోజ్వల పంచవటిని
చేరి యా[illegible]మునులకు చెలువొంద మ్రొక్కి
వారి సమ్మతినందువరు పర్ణశాల

గావించి మున్ను మార్గంబున నుండి -
శ్రీవెలయ జటాయు జెప్పిన బుద్ధి .
పతినెంచి సీత లక్ష్మణుండు సేవింప
జతనంబుగా పర్ణశాలలో నుండె
నంత రావణుని చెల్లెలైన శూర్పనఖ
సంతసంబున యదేచ్ఛగ నందు వచ్చి
నీలమేఘము వంటి నెమ్మేను వాని
బాలసూర్యుని మాడ్కి భాసిల్లువాని
కాముని కన్న చక్కని రూపువాని
రామాభిరాముని రాముని జూచి
వలరాజు చేజిక్కి వగలచే సొక్కి
వలపుల శివమెత్తి వద్దకు వచ్చి
మొగము చాటంతగా ముసిముసినవ్వ
చిగురింప రఘురాము నీక్షించి బలికె
తరుణుండవై నీవు తాపసవృత్తి
శరచాపధారివై చరియించుకతను
నిక్కంబుగా దెలుపు నీవెవ్వఁడనిన
రక్కసి జూచియా రాముండిట్లనియె
నా పేరు రాముండు నళినాయతాక్షి
నా పత్ని యీ సీత నా తమ్ముడితడు
తన తండ్రి దశరథ ధరణీశ్వరుండు
పనువడి మా తండ్రి పనుపున నేను
తన సహోదరునితో తరుణితో గూడ
వనముల చరియింప వచ్చియున్నాడ
నీ వెవ్వరెల నాగ నిక్కు పేరేమి

యూవని నొంటిగా నిట్లు రాతగవె
నీ ముద్దుమాటలు నీ విలాసములు
నీ మోహనాకృతి నీ మందయాన
ఈమే కాంతలకు గాన నింతినీయాన
నీకుల క్రమములన్నియు దెల్పుమనిన
నాశా పిశాచి తన్నలయింపుచుండ
నా శూర్పనఖ నాము కనియె నవ్వుచును
వరములుగొన్న రావణు సహోదరిని
సరగనా పేరు శూర్పనఖ శ్రీరామ
వలరాజునైన కల్వల రాజునైన
కలనైన పతిగా కాంక్షింపనేను
తగు నీకు తనకుమ దనరంగమనల
తగులజేసిన ధాత తగవరి సుమ్మి
యీ పడతుక నీకు యెందుండి వచ్చె
దాపురమాయె నీ తరుణిని బట్టి
ఘుటిక చందమున నంగుట వేసుకొనెద
సటగాదు జూడునా సామర్థ్యమనిన
సౌరదియై బెబ్బులిచూచి భీతిల్లి
హరిణి కైవడి సీతయదరిన జూచి
కొంత హాస్యము సేయకోరి రాఘవుడు
పంతంబులాడు శూర్పనఖతో సనియె
యువతియున్నది తన కుడురాణివటన
సవతి పోరాటంబు సైరింప గలవె
తరుణి క్రింకాదుచు తమ్ముడున్నాడు
వధియింపు బొమ్మన్న వడినుత్సహించి

జానవి కామ సంతాపాగ్ని పొగలి
మానుగా వచ్చి లక్ష్మణుని జూచి పతివై
నను చెట్టబట్టుము నన్నేలు కొమ్మ
నిను నమ్మివచ్చితి నీవు నాపతివి
చనవున రమ్మన్న సౌమిత్రి నవ్వి
తనయన్న తలచిన తలపెల్ల దెలిసి
యరవింద నేత్రి యాయన్నను తొలుత
వరియించితివి గాన వదినెవు నీవు
వావిగాదికమీద వలనొప్ప రామ
భూవరు ప్రార్థింపు పొందుగా నతడు
నీ చూపు నీ రూపు నీ విలాసంబు
చూచి సీతనురోసి సొంపుతో నిన్ను
చేపట్టుపొమ్మన్న చెలగి శూర్పనఖ
ఆ పల్కులాత్మ సత్యములుగా నెంచ
రమియించి మగుడి రాఘవుని ప్రార్థించె
రాముండు పొమ్మన్న రక్కసి మగుడి
సోలు స్రుక్కుచు సౌరదియైమండి
మేలంబుతోన సౌమిత్రి ప్రార్థించె
తమ్ముడన్నను నన్నతమ్ముని జూప
ద్రిమ్మరి తన కోర్కెదీరక పొగిలి
రతిరాజుచేతి యంత్రపు బొమ్మరీతి
ధృతిమాలి యందందు తిరిగి వేసారి
చలముమై కోపముజ్వాలప్రత్తి చెనగ
కలుషంబుతోన రాక్షసి విజృంభించి
ఓరి మానవులార! యొక దీనురాలి

దూరి నన్నలయింప తగునె మీకిపుడు
అలిగిన నేను బ్రహ్మాండ ఖండముల
నెలమి మ్రింగుదు మర్త్యులేపాటి యనిన
దాని పూనిక జూచి దశరథాత్మజుండు
దీని మేలము చాలు దీని శిక్షింపు
మనిన సౌమిత్రి కాలాగ్నిని బోలు
ఘన ఖడ్గమును సవ్యకరమున బూని
ముక్కును చెవులును మొదలంటబట్టి
చెక్కినప్పుడె రక్త సిక్తాంగి యగుచు
మొరలు పెట్టుచు పోరి ముక్కిడితొత్తు
ఖరునితో నడచిన కథయెల్ల దెల్ప
ఖరుండు రోషించి రాక్షసకోటి జూచి
వెరవొప్ప సేనల వెడలింపు డనుడు
సేనలు చెలరేగి సింహనాదముల
నానా ముఖంబుల నలువొప్ప నడుమ
ధీరు లభేద్యులు దేవ కంటకులు
వీరులు పదునాల్గువేల రాక్షసులు
తమతమ వాహన తతినెక్కి రాగ
సమరభేరీ మహాస్వనములు మొరయ
దూషణ త్రిశిరులు దుష్టుండు ఖరుండు
భీషణాయుధానక బృంద సంభరిత
కమలాప్తకోటి సంకాశ ప్రకాశ
కమనీయ నవరత్న కాంచనోదగ్ర
రణభయంకర మహా రథముల నెక్కి
కినుకతో వెడలిరి గగన మల్లాడ

కొనుగొని గీర్వాణ గణములు బెదర
వనధులు కలగ భూవలయంబు వగుల
తల్లడిల్లుచును దిగ్దంతులు మ్రొగ్గ
జిల్లబోతి తరణి బింబంబు దిరుగ
నక్కలు వాపోవ నలి రేగి నాల్గు
దిక్కుల గృధ్రముల్ త్రిమ్మరు చుం:
వడిగ బోరున రక్తవర్షముల్ గురియ
జడిగొన్న యట్టి దుశ్శకునంబులన్ని
లెక్కసేయక కరాశించి గర్జించి
గ్రక్కున రాగయూఖరుని వెంబడిని
కాల కార్ముక సేనగాము సుమేఘ
మాలి మహామాలి మఖవిరోధులును
పరుష వృథుగ్రీవవటు సర్పవక్త్రి
కరవీరనేత్ర భీకర విహంగములు
ననయ దుర్జయ రుధిరాశనులు మొదలు
పనిరెండు రాక్షస ప్రముఖులు మించి
పనిరెండు సూర్యుల వగది కేతేర
నిండార కెందూళి నెగడ దిక్కులను
దండకారణ్యంబు తగ ప్రవేశించి
అంత నాకల కలంబాలించి రాముఁ
డెంతయు సౌమిత్రి నీక్షించి పలికె
కంటివె లక్ష్మణ కడగి కెందూళి
మింటిను ముట్టి నెమ్మిగప్పె దిశల
రట్టడి ముక్కడి రక్కసి బోయి
ఢిట్టయై బలఘ్నుల దెచ్చెగాబోలు

కడువడి ధణసూచకము లనేకములు
పొడమ చున్నవి జూడు పొదరి దిక్కులను
ఖరవాధముల నుద్ధత పరాక్రముల
నేనొక్కంత ద్రుంతు నిముషమాత్రమున
జనకజ జంకెదు సౌమిత్రి దీని
గొనిపోయి పర్వత గుహనుండుమనిన
విని లక్ష్మణుడు రామ విభునికి మ్రొక్కి
గొనిపోయి సీతను గుహనుండె నంత
వేవేగ పదునాల్గు వేల రాక్షసుల
నేవిధంబున వధియించునో రాముఁ
డని విమానంబుల ననువొంద నెక్కి
పనువడితో నభోభాగంబు నిండి
దేవ సంఘంబులు తివిరి రాఘవుని
దీవించుచుండిరి తిర మొప్పనంత
కరవాల కుంతముద్గర భిండివాల
పరశుతోమర గదా పాణులై వచ్చి
దనుజయోధులు బాహు దర్పంబు మెరయ
తనజుట్టు కొనజూచి దశరథాత్మజుఁడు
కురుచ కెంజడలు గ్రక్కున నెత్తిజుట్టి
కరకు వల్కలములు కటిని సంధించి
చటుల కాలభుజంగ సముదగ్ర జాజ
ఘటిత కాంచన రత్నఘంటికానాధ
సంకులాలంకృత చాపంబు బూని
శంకరాకృతిని నిశ్శంకుండై యుయు
కలు రాక్షసులును క్రుంగుదైత్యులును.

వ్రాలు దానవులును దనరు యోధులును
హతమైన బహు శిరంబులు శరంబులును
తొడిబడిపడు పదాతులును హేతులును
మొనసి క్రుంగెడి గజమ్ములు ధ్వజములును
తునిసిన హరుల మతులును చేతులును
తరుచుగా బడిన దంతములు కుంతములు
కరిఖండలగు కార్ముకములు శంఖములు
రణమున తెగు మహారథులు సారథులు
గణుతింప రణము భీకరమైన జూచి
ఖరుడు దూషణుని రాఘవునిపై బనుప
దొరయ రోషంబున దూషణుండప్పు
డరదంబు దోలించి యారాము గాంచి
పరువడి శరపరంపరల ముంపంగ
నశని కల్పములైన యసుర బాణములు
దశరథాత్మజు మృదు తనువున నాట
దనరె రాముడు రక్తధారల మిసల
ననుపమ శోణ సంధ్యాభ్రమో యనగ
నరుణారవిందాక్షుండై రాముడలిగి
శరము రాక్షసులపై గాంధర్వమేయ
నా మహాస్త్రంబు కాలాగ్ని చందమున
భీమరాక్షస కోటి పెంపెల్లనడంచి
కరములు వేళ్ళ కాళ్ళునురములు
సరములు నొడలును సదరున తొడలు
మొటిక్కలు చెక్కలు మూపులు పిప్ప
అక్కలు డొక్కలు నమరు బక్కలునై

కేరి ఖండములు సేయగాంచి కోపించి
దురితాత్ముడైన యా దూషణుండార్చి
యమ్ముల నిగుడింప నవిజూచి నాలు
గమ్ముల రఘురాముఁడరదంబు గూల్చె
దురమున విరథుడై దూషణుండలిగి
పరిఘంబు ద్రిప్పుచు వరతేయ మేయ
శరమున శ్రీరాముఁడు సంధించి వాని
యుపమేయుటయు దైత్యుఁడొరలుచు బడియె
నలిగి ప్రమాథి మహాకపాలుండు
ఖలుఁడు స్థూలాక్షుఁడు గర్వించి పేర్చి
మువ్వురు రాగనిమ్ముల రాఘవుఁడు
నవ్వివారల గూల్చె నానాస్త్రములను
కని ఖరుండలిగి రాఘవు మీదనపుడు
పనిరెండు రాక్షస ప్రముఖుల బనుప
వారు ప్రతాప దుర్వారులై సమర
శూరులై శరముల జోరున కురియ
మదగజంబుల మీద మలసి కుప్పించు
కొదమసింహ స్ఫూర్తికొని రాముఁడపుడు
కాల కార్ముకుబట్టి ఖండించి వరుస
తూలించె విహగుని దుర్జయు నణచి
సోలించి సర్పాస్యు ద్రుక్కించి మేఘ
మాలి మహామాలి మర్దించి పిదప
నామకు శాత్రవు నణచి యా సేన
గాఘుని హరియించి కరవీరనేత్రు
వధియించి యతకండు వలనొప్ప ఖతిపి

రుధిరాశను గొట్టి రూపుమాయించి
గరిమ్వాడు త్రిశిరుఁడు ఖరుఁడును దక్క
సర్వ రాక్షసులను సమయించెనపుడు
త్రిశిరుఁడు కోపించి తెరగొప్పరథము
దశరథాత్మజునిపై దనర దోలించి
శరవర్షములను దాశరథిపై కురియ
శరములనెల్ల దాశరథి ఖండించె
నాతోన యసుర మూడమ్ముల రాము
ఫాలమేయుగ రామభద్రుండు నవ్వ
నలరేగి మూడు బాణములేసి వాని
తలలు ద్రుంచినవాఁడు ధరణిపై బడియె
ఖరుండు కోపించి నొక్కట రాముమీద
నరదంబు దోలించి యమ్ములవాన
గురియింప రాముఁడు కోపించి వాని
శరములు ఖండించె జగము భీతిల్ల
ఖరుని బాణములు రాఘవుని బాణములు
తరుచుగా భూనభోంతరములు నిండె
ఖరుని రాఘవుఁడు రాఘవుని ఖరుఁడు
సరసగా గొసపసు జయకాములగుచు
పోరాడనప్పుడు నభోమణి మాసె
నీరధుల్ కలగెను నేల కంపించె
ఖరుడంత జూచి రాఘవుచేతి విల్లు
సఱ్రుంచి వేసినర్థ చంద్రబాణమును
కవచంబు ఛేదించి గర్జించి రాము
నవికళంబుగను బాణాబ్ధిలో ముంచె

సరకుసేయక వాని శరముల రాముఁ
డరుదుగా గీర్వాణులందరు పొగడ
సాదరంబుగ కుంభసంభవ దత్త
కోదండమప్పుడు గొనయ మెక్కించి
యురగ సన్నిభమైన యొక్క బాణమున
తరలని దానికేతనమును ద్రుంచె
ఖరుండు చిట్టగని రాఘవుని మర్మముల
గురినాట నాలుగు శరముల నేసె
విసువక శ్రీరామువిభుడు బాణాగ్ని
కసురుని రథము పూర్ణాహుతిజేసె
విరథుఁడై ఖరుఁడు చేవిలు లేమినపుడు
కరమున గదబూని గర్జించి రాగ
కని రాముడా దుష్ట ఖరునితో ననియె
వినుము రాక్షస నీకు విజయ మింకేల
దినము సన్మునుల బాధించిన ఫలము
ననుభవింతువుగాక యన ఖరుండనియె
నాలంబులో రామ యల్పుల జంపి
యేల యీ గర్వోక్తులిదిగో నీయెదుట
నలిగి గదాహేతియై వచ్చినాడ
నిలువు సాముందర నీవు జంతైతె
యనుచు చేగద ద్రిప్పి యతనిపైనేయ
కసలి రాముఁడు దాని ఖండింపవాఁడు
విరివిగా నొక మహావృక్షంబు నేయ
వరువడి నది ద్రుంచి బాణ సంతతుల
నైంద్రాస్త్ర మొక్కటి యుమరించి రామ

చంద్రుండు ఖరునుర స్థలిగొండనేయ
గర్వంబు దక్కి దిగ్గజములల్లాడ
నుర్విపై యా ఖరుండొరిలుచు బడియె
నప్పుడానందించిరఖిల దేవతలు
నప్పుడు దీవించి రఖిల సన్మునులు
కురిసె పుష్పాలవాన కువలయంబునను
మరు దంకురమ్ములు మలయుచు వీచె
జనకజ తోడ్కొని సౌమిత్రి వచ్చి
తన యన్నకును మ్రొక్కి ధనువందుకొనియె
భూమిజ శ్రీరాము పొదివి కౌగిటను
వేమారు వినుతించె విబుధులు పొగడ
పరగ రాముఁడు పర్ణశాలకు వచ్చి
ధరణిజకును కూర్మితమ్మునికపుడు
ఖలులైన రాక్షస ఖండన క్రమము
తెలియజెప్పుచు సుఖస్థితి నుండెనచట
నంతనకంపనుండా లంకకేగి
వింతగా లంకేశు వీక్షించి మ్రొక్కి
యనువొంద ఖరదూషణాదుల వధయు
పరువడి శ్రీరాము భద్రు శౌర్యంబు
జనకజ రూపంబు సౌమిత్రి మహిమ
వినుపింప రాక్షస విభుఁడు కోపించి
రణ భీకరంబగు రథము తెమ్మనిన
ప్రణుతించి యపుడకంపను డిట్టులనియె
దేవ రాముని గెల్వ దేవేంద్రుకైన
దేవదేవుండగు త్రిపురారికైన

తరముగాదిందుకు తగునుపాయంబు
పరువడి జెప్పెద బాగుగా వినుము
ఆ వియోగాగ్నిచే నతడీల్గుననిన
కామంబు విధితన్ను గదిమితోయగను
కామాంధుఁడై పంక్తి కంతుడుపొంగి
సరగున రథమెక్కి శరనిధి దాటి
యరుదెంచి తాటకి యాశ్రమంబునకు
మారీచు పొడగాంచి మారీచుతోన
నారామ విక్రమంబసుర క్షయంబు
జెప్పి భూపుత్రికాసించి వచ్చుటయు
జెప్ప మారీచుఁడు శిరమూచి పలికె
కటకటా సకల రాక్షస లోకనాథ
యిటువంటి బుద్ధి నీకెవ్వడు జెప్పె
వాని దుర్మంత్రిగా వలనొప్పదెలియు
వాని దుర్మంత్రిచే పొలయు రాజ్యంబు
సదిగాక సాధ్వుల నాశగోరినను
వదలును సత్కీర్తి వంశంబులోన
కావున నీవు యీ కార్యంబుమాని
వేవేగ లంకకు విచ్చేయు మనిన
మారీచు బుద్ధి సమ్మతిగాగనెంచి
యా రాక్షసేశ్వరుఁడరిగె లంకకునను
ఖరదూషణాదుల ఘనుఁడు రాఘవుఁడు
పరిమార్ప జూచి శూర్పనఖ భీతిల్లి
పరువెత్తి లంకలోపల జొచ్చి సభను
మురువు సింహాసనంబున నున్నవాని

పది భాస్కరుల రీతి పది శిరంబులను
పది కిరీటమ్ముల భాసిల్లువాని
రావేశ్వరు జూచి రయమున మ్రొక్కి
భావంబు కలగ శూర్పనఖ యిట్లనియె
అన్నరావణ వినవయ్యా నీ శౌర్య
మిన్నాళ్లవలె చెల్లదెట్లంటివేని
రాముండను దశరథరాజనందనుఁడు
భూమిజతోన తమ్మునితోన వచ్చి
అరుదుగా మునులకు నభయంబు లిచ్చి
వరుసతోడుత పంచవటి నుండ జూచి
కామించి యేను దగ్గరకుపోయినను
నాముక్కు చెవుల నానక కోసి త్రోసి
పొమ్మన నదనై బోయినే ఖరుని
కమ్మను జూలి కృత్యమంతయు దెలుప
రోషించి ఘనరథారూఢుడై ఖరుఁడు
దూషణ త్రిసురులతో నేగుదేర
వారల రాముఁడ వార విక్రముడు
నీరుగావించను నిమిషమాత్రమున
దిక్కుసీవనియేగు దెంచితి ననిన
రక్కసి జూచి యారావణుండనియె
రాముని చందంబు రమణీయందంబు
సౌమిత్రి తెరగు నిచ్చల చెప్పుమనిన
యాచుప్పనాతి దశాస్యుని జూచి
చూచిన తెరగున సెరది చెప్పదొణగి
సాకారమదమహోజ్వల పరాక్రముఁడు

రాకేందు వదనుండు రామచంద్రుండు
కనకవర్ణుండు లక్ష్మణుండితెగాని
మొసయు సత్కళల రాముని వంటివాఁడు
సీత సౌందర్యంబు చెలువు వర్ణింప
ధాతకైనను వాని తాతకు తరమె
భూషణంబులకెల్ల భూషణంబతివె
భూషింప శక్యమె భూమిజ ననిన
మునుసకంపసుమాట ముద్దియమాట
వినవొక తెంచనె విస్మయం బంది
కొలువు చాలించి నెకొన్న మోహమును
తలపిడి రయమున తరలి రథమెక్కి
నా రావణేశ్వరుండం బుధిదాటి
మారీచు పొడగాంచి మగుడ కిట్లనియె
నీవు నా మంత్రివి నీవు నా హితుఁడు
నీవు నా జీవంబు నీకు జెప్పెదను
మారీచ రాముండు మత్తుడై వనిని
వారకజ్ఞాతుల వధియించి నపుడె
పగదీర్చుకున్న నేపాడినా బ్రతుకు
తగవెరవొక్కటి తలఁచి వచ్చితిని
మాయా మృగంబవై మారీచ నీవు
పోయి చరించుము భూపుత్రిజూడ
కామిని మృగవాంఛపట్టి తెమ్మన్న
రాముండు నీవెంట రయమున వెడలు
సీతనెత్తుకొని నేను చేరుదు లంక
సీత వియోగాగ్నిచే రాముఁడణగు

నామనోరథములు నాకు సిద్ధించు
నామీద సగము రాజ్యంబు నీకిత్తు
ననవిని మారీచుడల్లన నవ్వి
దనుజనాథుని జూచి తగనెంచి పలికె
దనుజేశ మరియు నీ తలపోల తప్పె
తన కీడుకోరునే ధరనెవ్వడైన
దనుజ భేదన జయోద్ధాము శ్రీరాము
మనుజ మాత్రునిగాగ మదినెంచవలదు
శైశవంబున రామచంద్రుని క్రమము
కౌశికాధ్వరమును గనియున్నవాడ
నానాటి మొదలు నేనసుర కృత్యంబు
మాని తపోవృత్తిమౌనినై యిచట
రతియన్న రవియన్న రాజీవమన్న
రతనంబులన్నను రాజసంబన్న
మహినిశేషాది నామములు విన్నంత
సహిత భీషణ రాముఁడని తలంపుచును
నీ యీ విధినున్నాడ నీబుద్ధిమాని
రావణ పొమ్మన్న రావణుంచలిగి
మారీచ నీవు నామాట గైకొనక
పిరుడివై యొక్క వెరవు జూపెదవు
సురులనైనను బట్టి స్రుక్కింతు నేను
నరులెంత తెలియవే నా పరాక్రమము
నన్ను రాజనుచు మన్నిత నెంచకున్న
నిన్ను వధియింతు నిక్కంబటన్న
నతని రోషము జూచి యాత్మనూహించి

యితనిచే పడు కంటె యిన వంశుచేత
పడయుట మేలని మారీచుడనియె
విడిచితి నీతి నీ వెంటనే వత్తు
నన దశగ్రీవుండతని దోడ్కొనుచు
చనె పంచవటికి నుత్సాహంబుతోన
మాయావి గావున మారీచుడంత
మాయామృగాకృతి మసలుచువచ్చి
సరస చేష్టలు పర్ణశాల ముందరను
చరియింప సీత యచ్చట రాముజూచి
జీవేశ యిటువంటి చిత్రమృగంబు
నీ వనంబులలోన నెన్నడు జూడ
దీని పట్టుకురమ్మ దీనిపై మరులు
నేను జూచుచు పొద్దునెరపెద ననిన
విని లక్ష్మణుడు రామవిభుజూచి పలికె
మనుజేశయిది దైత్య మాయగాబోలు
నీతూపు మృగముల కెందైన గలదె
మారీచుడిటువలె మనల భ్రమింప
వచ్చినాడనిన భూవరుడు భూపుత్రి
ముచ్చటజూచి తమ్మని కిట్టులనియె
తలకకు సౌమిత్రి దైత్యుల మాయ
నిలుచునే నాముందు నిజమృగంబైన
గొనివత్తు కాకున్న కూల్చెద నిందు
సీతనే మారక రక్షింపు మటంచు
నాతరి విల్లందియా రాఘవుండు
మృగము వెంబడి బోవ మృగము బిట్టురికి

జగతిపై కుప్పించు చప్పుడాలించు
పట్టబోయిన నిట్టివది మింటి కెగయు
నెట్టన మగుడిన నిలబడు నెదుట
నీరీతి రఘురాము నెలయించుకొనుచు
దూరంబు గొనిపోవ దుష్టరాక్షసుని
మాయ గుర్తెరిగి లక్ష్మణు మాటమెచ్చి
పాయక రాముండు బ్రహ్మాస్త్రమేయ
హా! లక్ష్మణాయని హా! సీతయనుచు
కూలె మారీచుండు కొండ చందమున
నప్పుడా యసురుని యార్త స్వరంబు
తప్పక విని సీత ధైర్యంబు వదలి
పోనాడి లక్ష్మణు పొమ్మన్న నతడు
దీనుఁడై రాముని దెస కేగుదెంచి
యిది నాకు తరియని యిచ్చ జింతించి
పది ముఖమ్ములవాఁడు భయము మోహంబు
పెనగొన దండంబు పెనుకమండలము
ఘన పవిత్రమ్ములు కావిధోవతులు
ధరియించి తోడనే తన మాయజూచి
యన్యాయమని దేవతావళి వగప
సన్యాసియై పర్ణశాల కేతెంచి
యవనిజ దీవింప నబ్జాక్షి మ్రొక్కి
సవినయంబుగ పూజసల్పియా మీద
తన తెరగెల్లను ధరణిజ జెప్ప
విని రావణుఁడు తన విధమెల్ల దెల్పి
వరము లిర్వది పుస్తకమ్ములు చదియు

పరగ స్వకీయ రూపమ్మున నిల్చి
నిలిచిన కనుగొని నివ్వెఱగంది
కలగి మూర్ఛిల్లిన కల్యాణినెత్తు
కొని రథంబున నిడుకొని రావణుండు
చన మార్గమున మూర్ఛణనకఱ దెలిసి
కనువిచ్చి జూచి రాఘవుని భావించి
పనువడి రామ నీ భార్యను నన్ను
కొనిపోవుచున్నాడు కుటిల రాక్షసుఁడు
పడి నన్ను విడిపించు వారెవ్వరికను
వేవేగ చనుదెంచి పీనిని జీల్చి
కావవే నాసిగ్గు కావవే యనుచు
మొరలిడుచున్న యా మొరలాలకించి
యురు బలాఢ్యుడు జటాయువు మేలుకాంచి
దేవారి కృత్యంబు దెలిసి చిట్టెగసి
రావణు కడ్డమై రయమున నిలిచి
విడువు రామునిదేవి విడువక యున్న
విడవ నీ ప్రాణముల్ విడిపింతుననుచు
తుండాగ్రమున విల్లు తునకలుజేసి
ఖండించి హయముల కడట సారథిని
ప్రకటంబుగా భుజ భాగముల్ జీరి
మకుటముల్ పడదన్ని మర్మముల్ చించి
పరువడి రథమున భగ్నంబుజేయ
విరథుఁడై రాక్షస విభుడు కోపించి
యొరదీసి ఖడ్గంబు హుంకించి బట్టి
ఱెరకలు తెగ ప్రియ నేపెల్లతూలి

సౌరదిష్టు జానకి చూచి శోకింప
నొరగి జటాయువు భూమిపై నుండె
నంత రావణుడు సీతాంగన గొంచు
సంతసంబున బోయి జలనిధిదాటి
లంకకుబోయి యా లావణ్యవతికి
శంకతేకను తన సంపదల్ జూప
నా, తాపసునిదేవి యలిగి రావణుని
తూలనాడగవాఁడు దుఃఖించి మిగుల
నాసీత నప్పుడశోకావని నునిచి
గాసిల త్రిజటాది కాంతలందెచ్చి
కావలిగానుంచి కామార్తుఁడగుచు
రావణుండుండె విరాళితో నంత
సిచు మారీచున సిరుగాజేసి
వాచంయమిశ్రేణి వర్ణింప నంత
రాముడు వచ్చి యరణ్య మధ్యమున
సౌమిత్రి పొడగాంచి జడసి యిట్లనియె
తడయక లక్ష్మణ ధర్మంబు మాలి
యడవిలో నొంటిగా నవనిజ విడిచి
వత్తువేయన మ్రొక్కి పడిగ లక్ష్మణుడు
చిత్తంబు కలగంగ శ్రీరాము కనియె
అన్న నాకిటువలె నరుదేరదగదు
మన్నింపు ధర్మంబు మరతునే నేను
హాః సీతయన దానవాత్తరవంబు
యూ సీతవిని నిన్ను హితములాడి
పొమ్మన్న వచ్చితి భూమిజయనుచు
క్రమ్మ బాష్పమ్ములు కడుభీతినున్న

సౌమిత్రి నూరార్చి సరభసంబునను
రాముండు వచ్చి యాశ్రమ భూమిఁజూచి
ఇదియేమి లక్ష్మణా యీ యాశ్రమంబు
తుదిముట్ట శూన్యమై తోచుచున్నదియు
నని పర్ణశాలకు నలయుచు వచ్చి
దినమణి రుచిలేని దినలక్ష్మి రీతి
కులుకు హంసలులేని కొలను చందమున
మలయ కోకిలలేని మావికైవడిని
యనుగు భామినిలేని యా పర్ణశాల
కనుగొని భీతిల్లి కమలా ప్రభుండు
పొదలను సరసుల భూమిజ నపుడు
వెదకుచు వెదకుచు వెతజెంది జెంది
తమ్ముఁడు తనకింత ధైర్యంబు దెలుప
నెమ్మితో వినకను నిట్టూర్పు బుచ్చి
పెదవుల తడపుచు పెంపెల్ల వాలసి
సుదతిని పేర్కొని సొరది యందున్న
శుకముల పికముల శుభలతావళుల
మొకరి తుమ్మెదల నిమ్ముల విహంగముల
నగముల మృగముల నళినాకరముల
మృగమధ్య నడుగుచు మిగుల సోలుచును
చనిచని ముందర సమర భూస్థలిని
కనకాచలేంద్రంబు గతిబడియున్న
పక్షి జటాయువు పతికించి పిడు
రాక్షసుండని యెంచి రాముండు కనల
శిక్షింప యత్నంబు

పక్షీంద్రుడా రామభద్రుని కనియె
దేవ శ్రీరామ నీదేవి వంచించి
రావణుండెత్తుక రథమున బోవ
బోనీక యడ్డమై భూరి సత్వమున
దానితో పోరాడి వసుధ గూలితిని
యిదెవాని కేతన మిదేవాని యరద
మిదెవాని సారథి యిదెవాని చాప
మని జూపి రఘువీరునకును నవ్వలను
దనుజాధముని రాజధాని మార్గంబు
జనకజ పలికిన సమయ వాక్యములు
పనుపడి సౌమిత్రి పలుమారు వినగ
చెప్పెదనని యెంచి చిట్టాడు వెతల
చెప్పజూడక పక్షి జీవముల్ విడిచె
నంత నా రఘురాముడా జటాయువుకు
వింతగా పరలోక విధులెల్ల దీర్చి
యావల కదలి క్రౌంచారణ్యమెల్ల
భావించి యోజన బాహువధింప
వాఁడు గంధర్వుడై నిజాప్తకులుల
పొడిమి నుతియించి పొలుపొంద పలికె
రావణుండిపుడు నీరమణి నెత్తుకొని
కావరంబునను లంకాపురికేగి
శబరి యాశ్రమమదే చక్కగా జనుడు
శబరి పూజలు మీకు సల్పు నామీద
సుగ్రీవు నుల్లంబు సౌరది గడించు
నిగ్రహింతువు రామ నీవు రావణుని

సీత నిన్నెనయును శీఘ్రంబుగాను
సీతతో పట్టాభిషిక్తుండవై యుందు
వదుచు దీవించుచు నమరేంద్ర పురికి
చానేగె నంతట దశరథాత్మజులు
సచ్చరిత్రులు బోయి శబరి యాశ్రమము
జొచ్చినప్పుడె వారి జూచియా శబరి
యెదురేగి సాష్టాంగమెరిగి పూజించి
వదలక తోడ్తెచ్చి వరపీఠినుంచి
ఇందీవర శ్యామ యినకోటిధామ
సుందరంబైన నీ శుభమూర్తి గంటి
పరువడి నా తపఃఫలమందుకొంటి
గురుతుగా నీ శౌర్యగుణము తేవింటి
పరమ తత్వము నీవె పరమంబు నీవె
పరమేష్టి నీవె యా బ్రహ్మంబు నీవె
క్షరములూ నీవె యక్షరములు నీవె
క్షరమక్షరములకు సాక్షివి నీవె
నిన్ను సన్నుతిసేయ నేర్తునే రామ
మన్నింపుమని తన మహిమ దీపింప
కంద మూలంబులు కరుణతో దెచ్చి
విందు గావించి భూవిభుజూచి పలికె
నీ కాంతగొని చన్న నీచు వధియింప
ఈమె కాకుత్థై మీరతిత్వేగ తగదు
సూర్య పుత్రుండైన సుగ్రీవుతోడ
నార్య సమ్మతిగ సఖ్యంబు గావించి

కపి రాజునకు నుపకారంబు జేసి
కపులతోడుత గూడి కదలి రావలెనని
సమయించి సంగతి జయలక్ష్మితోన
విమలాక్షి సీతను వేవేగ తో గూడు
మని రాము సన్నుతి సనలంబు చేర్చి
తనువు నాహుతి జేసి తన మదిలోన
సత్యసంధుని రామచంద్రుని నిలిపి
సత్యలోకమునకు జనియె నా శబరి
రమణి చెప్పిన జాడ రామలక్ష్మణులు
క్రమము దప్పక పోయి కని ఋష్యమూక
మూ సమీపమున ఫుల్లాబ్జకల్హార
భాసురంబైన పంపా సరోవరము
కని కృతస్నానులై కందమూలముల
నను వడి భుజియించి బహలిక దాసి
తరణి వంశజుఁడింత తమ్మునితోన
సొరది యచ్చటి వింత జూచుచునుండె
అని భోసలాబ్ధి సుధాంశుడుత్తముడు
ఘననాథతుల్యుడు ధీర విక్రముడు
సరస సాహిత్యలక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుండు కవి కల్పకంబు
విలసిల్లు తుళజ భూవిభు కుమారుడు
పొలుపొందు నేకోజి భూమిపాలకుడు
తనతండ్రి తుళజేంద్ర ధరణీశు పేర
పెనుపొంద మకరంద బిరుదాంకు పేర
శ్రీలు రంజిలు శబ్దచిత్రార్థముల

రమణీయమైన యీ రామాయణమున
క్రమమొప్ప నారణ్యకాండంబు జెప్పె
యిది తుళరాజేంద్రులకిడు నెప్పుడిలను
పొదలు సంపదలును పూర్ణశక్తులను
సకల దీర్ఘాయుష్య సంతానములను
సకల రాజ్యంబుల సకల భోగముల
సమర జయంబులు సకల సత్కీర్తు
లమరంగ నొసఁగు మహారామ చరిత
మిది మహాపుణ్యద మిది వేదసార
మిది ముక్తిసోపాన మిది శుభోదర్క
మివ్వసుందర భక్తి నెలమితో దీని
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను
భువిలోన వారికి పుత్ర సంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసు రంజిలజేయు మానినీమణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసగు
ధరణిలోనా చంద్ర తారార్కముగను